# జిడ్డు కృష్ణమూర్తి

## జీవితము - భాషణము



జె. శ్రీరఘుపతిరావు

B.P. 5

# JIDDU KRISHNA MURTHI JEEVITAMU - BHASHANAMU

By
**J.S. RAGHUPATHI RAO**

10-10-1993

Copies : 2000

Rate : 10 = 00

Copies at :
S.K. GARGI
**ATMARAMA ASRAMAM**
Gouthami Nagar,
KOVUR - 534 350.

**BAK PUBLICATIONS**
5-294/D, Munireddy Nagar,
Tirupati - 517 502.

Printers :
**Keerthi Offset Printers**
98, Prakasam Road, Tirupati
Ph. : 22973.

# దీనివైనం

శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి జీవితం అద్భుతమైంది. ఎందరికో స్పందన ఇచ్చింది.తెలుసుకోతగింది. దానిని ఇక్కడ సంక్షిప్తంగా పేర్కొన్నాను. ఇది పూర్వం వ్రాసిన"జిడ్డు కృష్ణమూర్తి జీవిత సంగ్రహము'

జీవితం గూర్చి వారేం చెప్పిందీ ఋూకిగా తెలుసుకోడానికి కొన్ని సంభాషణలు ఇంగ్లీషు నుండి తర్జుమా చేశాను. తారా సంసను రద్దుచేసేటప్పుడు చేసినప్రసంగం పూర్తి పాఠం ఇచ్చాను. బ్రాక్వుడ్ పార్క్లో చెసిన ఆత్మపరిశీలనాప్రసంగమూ, ఐక్యరాజ్యసమితిలో ఇచ్చిన సందేశమూ, తానే స్వయంగా వ్రాసిన'ప్రవచనసారం' ఇందులో ఉన్నాయి. వీటినిబట్టి కృష్ణజీ తత్వం కొంతవరకు అర్థమవుతుంది. కృష్ణజీ పుస్తకాలనుండి కొన్ని అద్భుత వాక్యాలు ఏరి అనుబంధంలో చేర్చాను ఇదివరకు "కృష్ణసూక్తం"గా ప్రకటించిన వంద వందారు సూక్తులు కూడ అనుబంధంగా కూర్చాను.

సరళమైన జీవనం, లోతైన మానవతా విలువ, గంభీరమైన అంతరంగ చైతన్యం నిత్యానుభూతిలోకి రావడమే జీవితసార్థకత. అవి కృష్ణజీ జీవితంలోనూ,ప్రవచనంలోనూ పుష్కలంగా ఉన్నాయి.

మతం పేరుతో - వ్రతం పేరుతో, వేదాంతం పేరుతో, సిద్ధాంతం పేరుతో, కులంపేరుతో, గణం పేరుతో, జాతి పేరుతో, నీతి పేరుతో, స్టేటు పేరుతో, ఓటు పేరుతో దేశం అతలాకుతలమైపోతోంది. భ్రమించిన తరుణంలో తరుణోపాయం కొరకు వెదుకులాడుతున్నారు. ఒక సమస్యా పరిష్కారం మరో సమస్యకు దారితీస్తున్నది. మానవ సమస్యలు మౌలికంగా తెలిస్తేతప్ప, అవి మాసిపోవు. అదితెలుసుకోడానికి కృష్ణమూర్తిగారి పరిశీలనాక్రమం దోహదకారి కాగలదు. అది మనఃప్రవృత్తిలో విప్లవం తేగలదు.

చిత్తక్షోభ క్షయించాలంటే కృష్ణజీని చదవండి. విస్తృత అధ్యయనానికి ఈ చిన్నిపుస్తకం నాంది పలకగలదు. అధ్యయనం చేయండి, అధ్యయన కేంద్రాలుతెరువండి. అర్థంచేసుకోండి. విభజనలకూ విభేదాలకూ అంతం చూడండి.

పద్మావతి నగర్

తిరుపతి - 517 502

జె. శ్రీరఘుపతి రావు

# ర్షికలు



## అనుబంధాలు

# అతడె జిడ్డు కృష్ణమూర్తి

ఏకాకి కాదతడు ఏకాంతుడు
చీకట్ల లోకాన వెలుగాతడు||
పసిపిల్లల మనసతనిది
పలుముద్రలు పడనీయడు
ఇనుకరేణువూ కోరడు
ఇనుమంతయు అహమెరుగడు |
పోటీపడి పెరుగలేదు
పోల్చిచూసి బ్రతుకలేదు
తానే తన మార్గమై
తానే తన ధ్యేయమై ||
ఆలోచన చాలించిన
ఈలోకపు చైతన్యం
గతమును హాతమొనరించిన
సతతనూత్న సంజీవి ||
ఎప్పటికప్పుడు గ్రహించి
ఉన్నది ఉన్నట్లు చూసి
క్షణ క్షణం జాగృతిగల
అనురాగపు టంబోనిధి ||
కుల మత గురు దైవాలను
కుటిల జాతి భేదాలను
జటిల మనో బంధాలను
పుటమార్చిన బడబాగ్ని ||
జీవన దర్శన స్ఫూర్తి
వసుధైక కుటుంబవర్తి
తాత్త్వికక యుగ చక్రవర్తి
అతడె జిడ్డు కృష్ణమూర్తి ||

# జననం

మహోన్నత భావగుణ లక్షణలక్షితుడైన పరిపూర్ణ మానవతామూర్తి శ్రీ జిడ్డుకృష్ణమూర్తి. నిశిత పరిశీలన, సూక్ష్మావగాహనల సమ్మేళనమే అతని జీవితం.సంపూర్ణ స్వేచ్ఛ అతని వికాసానికి ఊపిరి. సమస్త మానసిక భౌతిక నిబద్ధతకులోనుగాకుండడమే ఆ స్వేచ్ఛకు జీవం. ఆతనిలో మేధా సంపత్తి, విశాలహృదయం సమపాళ్ళలో వృద్ధిచెందాయి అందుచే సామాన్య వ్యక్తిగా జన్మించి,విశ్వమానవుడుగా జీవించినాడు.

జిడ్డు కృష్ణమూర్తి 1895 మే నెల 12 న మొదటి అర్థగంటలో మదనపల్లిలో స్వగృహంలో పూజామందిరంలో పుట్టాడు. అష్టమ గర్భసంజాతుడగుటచే కృష్ణమూర్తి అని పేరు పెట్టారు తల్లి సంజీవమ్మ, తండ్రి నారాయణయ్య. తండ్రి1907లో మేజిస్ట్రేట్‌గా ఉద్యోగ విరమణచేశాడు చిన్నతనంలో (10 వ ఏట) కన్నతల్లి చనిపోయింది. అతడు ప్రాథమిక విద్య అనంతపురం జిల్లా కదిరిలోనూ, మదనపల్లిలోనూ అభ్యసించాడు.

# అడయారుకు వెళ్ళడం

దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షురాలైన ఆనిబెసెంట్ అనుమతితో నారాయణయ్య నల్గురు కుమారులతోడ్కొని అడయారు వెళ్ళాడు. సమాజ అంతరంగిక విభాగంలో సహాయ కార్యదర్శిగా చేరాడు. దైవ సంబంధమైన విద్య (ధియసోఫియా--ధియాసఫి) ప్రచారం చేయడానికిగాను న్యూయార్కులో 1875లో కర్నల్ హెన్రీస్టీల్ ఆల్కాట్ మరియు మ్యాడమ్‌హెలీనా పెట్రోవా బ్లావెట్స్కీ కలిసి దివ్యజ్ఞాన సమాజాన్ని స్థాపించారు.దానికి 1882 నుండి మద్రాసులోని అడయారు ప్రధాన అంతర్జాతీయ కార్యాలయమైంది. విశ్వమానవ సౌభ్రాత్రాన్ని, మతవిజ్ఞాన శాస్త్రజ్ఞానాన్ని,ప్రకృతి మానవశక్తుల అవగాహనాన్ని పెంపొందించడం దాని ధ్యేయం.సభ్యులకు అతీంద్రియ శక్తులలో విశ్వాసంమెండు. అగోచరంగావుండే కుతుమి,మౌర్య, మైత్రేయ మున్నగు పరమ గురువులు (మాస్టర్స్) సమాజాన్నిరక్షిస్తున్నారనీ, అవతార పురుషులుగా ప్రపంచాన్ని నడుపుతున్నారనీ వారిప్రగాఢమైన నమ్మిక. ఆంగ్లేయుడు, ఆకర్షణీయుడు ఆయన లెడ్ బీటర్(BishopCharles Webster Leadbeater)అను ప్రసిద్ధి

సభ్యుడు ఈ అతీంద్రియ విశ్వాసవర్గంలో ప్రముఖుడు. ఈ విషయంలో అతడు బెసెంటుకన్నా ఆదర్శవంతుడు

## ప్రత్యేక శిక్షణ

నారాయణయ్య అడయారు కేంద్రంలో నివసిస్తూ బిడ్డలను పాఠశాలలో చేర్చాడు.కృష్ణమూర్తి, తమ్ముడైన నిత్యానంద పన్నత్తూర్ సుబ్రహ్మణ్య హైస్కూల్లో చదువుతున్నారు. కృష్ణ పరధ్యానంగాను, ప్రకృతి అవలోకనంలోను వుండిచదువులో మందకొడిగా వుండడంతో ఉపాధ్యాయుడు కఠినంగా కొడుతూ బయటనిలబెడుతూ వుండేవాడు ఇంటికి వచ్చినపుడు అడయారు కేంద్ర విశాలప్రదేశంలోఆడుకుంటూ వుండేవాడు. ఒకనాడు ఇసుక తిన్నెలపై తిరుగాడుతున్నకృష్ణమూర్తి నిత్యానందలను లెడ్‌బీటర్ చూసి ఆకర్షితుడైనాడు. కృష్ణమూర్తిలోవిశ్వగురువుకాగల విశ్వమానవుని లక్షణాలున్నాయని గుర్తించాడు. మైత్రేయప్రభువు ప్రవేశించడానికి ఆతని దేహం అనువైనదని భావించాడు. ఆతని గతజన్మవృత్తాంతాలను వివరించి వ్రాశాడు. ఆతనికి ఆల్సియోన్ (కృత్తికా కాంతిపుంజం)అని నూతన నామకరణం చేశాడు.

ఆనిబెసెంటు సహకారంతో నారాయణయ్యను ఒప్పించి కృష్ణ,నిత్యలకు సమాజంలోనే పూర్తిగాభోజన నివాస శిక్షణ వసతులు కల్పించి లెడ్‌బీటర్ ప్రత్యేకవిద్య గరుపుచున్నాడు. సామాన్య విద్యకై ప్రైవేటుగా సమర్థులయిన సభ్యులను శిక్షకులుగా ఏర్పాటుచేశాడు. లెడ్‌బీటర్ ఎక్కువకాలం కృష్ణతో ఒంటరిగా గడుపుతూ ఉన్నాడు. అంతరంగిక దివ్యశిక్షణకై సూక్ష్మశరీరాలతోపరమగురువులగు కుతుమి మైత్రేయుల వద్దకు తీసికొని వెళ్ళుచున్నాడు. శరీరారోగ్యానికి తోడనేవుండితోడ్పడు చున్నాడు. స్నానపానాదులు చేయడంలో, దుస్తులు ధరించడంలో, వ్యాయామ శిక్షణలో అతిసన్నిహితంగా వుండి శ్రద్ధగా శిక్షణ యిస్తున్నాడు. లెడ్‌బీటర్, కృష్ణలు ఒంటరిగా అర్ధనగ్నంగా వుండడంలోఅనుమానాలు చెలరేగ సాగాయి. పైగా పిల్లలలో లైంగిక దురభ్యాసాలు ప్రోత్సహిస్తాడనీ, వాళ్లతో అశ్లీలంగా ప్రవర్తిస్తాడనీ లెడ్‌బీటర్‌పై అపవాదులు అంతకుముందు నుండీ వున్నాయి. బెసెంటుకుసమవయస్కుడైన లెడ్‌బీటర్ వయస్సు అప్పటికి 62 సంవత్సరాలు,కృష్ణ వయస్సు 14 సంవత్సరాలు.

ఈ అపోహల ప్రచారం చాలకాలం సాగింది అందుచే తన బిడ్డలను లెడ్‌బీటర్‌బారి నుండి తప్పించమని నారాయణయ్య కోరాడు. ఆనిబెసెంటు ఉపాయంగా బిడ్డలను దత్తత తీసికొని, విద్యార్జనకై ఇంగ్లండు పంపింది అక్కడకూడ లెడ్‌బీటర్ చేరువయ్యాడు. బిడ్డల నప్పజెప్పమని నారాయణయ్య ఆనిబెసెంట్‌పై మద్రాసు కోర్టులో దావా వేశాడు. బిడలు కోర్టుస్వాధీనంలో వుండునట్లు తీర్పు అయింది. ఆమె లండన్ ప్రీవి కౌన్సిల్‌లో పిటిషన్ పెట్టుకొన్నది. విచారణసమయానికి పిల్లలు దాదాపు మేజర్లు అయ్యారు బిడ్డల అభీష్టం మేరకు వారు బెసెంట్‌తోనే వుండునట్లున్నూ, మద్రాసు తీర్పు అమలు జరుప వీలుకాదనిన్నీ ప్రివికౌన్సిల్ వెల్లడిచేసింది.

## ఇంగ్లాండులో విద్యాభ్యాసం

అప్పటినుండి అన్నదమ్ములు పూర్తిగా బెసెంట్ ఆదరాభిమానాలతో నిరాఘాటంగా, నిశ్చింతగా ఐరోపాలో విద్యాభ్యాసం కొనసాగిస్తున్నారు ఇండియా వైశ్రాయ్‌అయిన లిటన్ దొర కూతురూ, ఢిల్లీ ఆర్కిటెక్ట్ అయిన ఎడ్విన్ లట్యెన్స్ ఇల్లాలూ, సమాజ సభ్యురాలూ అయిన లేడి యెమిలి కృష్ణమూర్తికి అత్యంత అభిమానురాలయింది, ఆత్మీయురాలయింది బాలకృష్ణుని యశోద లాలించి పోషించినట్లు, కృష్ణను యెమిలి ఆదరించి సేవించింది. నిర్మలహృదయులైన స్త్రీపురుషులెల్లరితోనూ, వారి కుటుంబ సభ్యులందరితోనూ కృష్ణ ప్రేమపాత్రంగా కలిసిపోయేవాడు. అట్లే ఫ్రెంచివారైన మ్యాడం మాంజియర్లి కుటుంబీకులతో చాల సన్నిహితుడైనాడు వారితోపాటు ఇంకా అనేకమంది వ్యక్తులు కృష్ణవిద్యాశిక్షణ, దీక్షాశిక్షణ, విశ్రాంతి, యాత్రా శిబిరాలకు హాజరవుతుండేవారు. వారికతడు అప్పుడప్పుడూ ధర్మప్రబోధం చేయుచుండేవాడు

నిత్యానందమీద కృష్ణ ఎక్కువగా ఆధారపడేవాడు ఇరువురూ పడుగు పేకల్లాగ కలిసిపోయారు నిత్య విద్యలో చురుకుగావుండి లండన్ మెట్రిక్ పరీక్షలు పాసయి,లా చదువుతున్నాడు కృష్ణ మెట్రిక్ పరీక్షలు ముమ్మారు తప్పాడు. దాంతో బెసెంట్ సలహాపై పారిస్ వెళ్ళి ఫ్రెంచి భాష నేర్చుకుంటున్నాడు ఇంతలో లండన్‌లోనున్న నిత్యకు క్షయ వ్యాధి సోకింది కృష్ణ అతణ్ణి పారిస్ రప్పించుకొని చికిత్స చేయించాడు. వ్యాధి తగుముఖం పట్టింది

# ఓహై చేరడం

లెడ్‌బీటర్ సిడ్నీలో (ఆస్ట్రేలియా) చర్చి బిషప్‌గా వుంటూనే దివ్యజ్ఞాన సమాజ కార్యక్రమాలు నిర్వహిస్తున్నాడు. అక్కడి సమాజ వార్షికోత్సవాలకు అనిబెసెంటు ఆదేశాన్ననుసరించి అన్నదమ్ములిద్దరూ సిడ్నీ వెళ్ళారు. చర్చిలోని అట్టహాసపు ఆడంబర ఆరాధన వ్యవహారాలు కృష్ణ కేమాత్రంనచ్చలేదు. సమావేశానంతరం నిత్యానందను డాక్టరు పరీక్షచేసి రెండు ఊపిరితిత్తులూ దెబ్బతిన్నవని చెప్పాడు. అందుచే అతన్ని సమశీతోష్ణ వాతావరణంగల స్విట్జర్లాండుకు తరలించాలనుకున్నారు స్విట్జర్లాండు చేరేముందు ఓహైలోయ (కాలిఫోర్నియా)లో కొంతకాలం వుండిన ఆరోగ్యాభివృద్ధి కలుగునని మిత్రుడైన వారింగ్‌టన్ సలహాయిచ్చాడు. అక్కడ ఒక ఇల్లుకూడా కుదిర్చాడు.అందుచేత మిత్రునితో సహా అన్నదమ్ములిరువురూ ఓహై చేరారు సమాజసభ్యురాలైన ఒక దయామయి మేరీగ్రే రెండు భవనాలలో వసతి కల్పించింది.

ఓహై(OJAI) అనగా దారికి దూరంగావున్న వూరు. అది 15000 అడుగుల ఎత్తున ఆహ్లాదకర వాతావరణంలో అనాసతోటల నడుమ పర్వత శ్రేణులచే పరివేష్ఠితమై వున్న రమణీయ ప్రదేశం. లాస్‌ఏంజల్స్‌కు 80 మైళ్ళ దూరంలో ఉత్తరంగావుంది. నిత్యానంద చికిత్స పొందుతూ విశ్రాంతిగా వున్నాడు. కృష్ణ ధ్యానాదులు చేస్తూ ప్రశాంతంగా వున్నాడు. పరస్పర సహకారంతో పనిపాట్లు,పరిచర్యలు చేసుకుంటూ అనువుగా కాలం గడుపుతున్నారు. అక్కడకృష్ణమూర్తికి ఒక విధమైన అనుభూతులు (1923లో) మొదలయ్యాయి.వెన్నెముక, మెడ, తలలలో తీవ్రమైన నొప్పి కలుగుతుంది. కలవరించడం, సేవచేస్తున్నవారిని తాకవద్దని నెట్టివేయడం, "అమ్మా !" అని అరవడంచేస్తున్నాడు. ఆవేదనతో రెండు రోజులు గడిచాయి. అతనివద్ద నిత్య, నిత్యకు సేవచేస్తున్న ఒక అమెరికన్ యువతి రోజలిండ్, మిత్రుడు వారింగ్టన్ వున్నారు.

# పరివర్తన

ఆగష్టు 17 మూడవరోజు. ఆవేదనా ప్రక్రియ తీవ్రమైంది ఆ స్థితిలో అతణ్ణి ఎదురుగావున్న పెప్పర్ వృక్షం క్రిందికి వెళ్ళమని వారింగ్టన్

చెప్పాడు.కృష్ణమూర్తి వెళ్లి కూర్చున్నాడు. ఆనాడు ఏదో అద్భుతం జరుగుతుందని మిగతా వారంతా వరండాలో వేచి చూస్తున్నారు. పెప్పర్‌చెట్టు పొడుగాటిఆకులతో, పసుపుపచ్చ పూలతో, ఘుమాయించే సుగంధంతో, కలకలంచేసే పురుగులతో, పులుగులతో నిండివుంది. నీడ బాగా ఇస్తుంది. కృష్ణ పద్మాసనాసీనుడయ్యాడు. అపస్మారక స్థితిలో వున్నాడు. కాస్త తెలివి రాగానే వణుకుతున్నాడు. ఏదో సణుగుతున్నాడు. మాట పెకలడంలేదు. ఓపిక తెచ్చుకొని ఆరాధనా శ్లోకాలు ఉచ్చరించాడు. తక్షణం మౌనం వహించాడు. బహిర్గతంగా ఆవేదన చెందుతున్నాడు. అంతర్గతంగా అనుభూతులు చెందుచున్నట్లున్నాడు.అవేవో అతనికే తెలియాలి. కొంతసేపటికి మెల్లగా, మెలమెల్లగా లేచాడు.సవ్వడి కాకుండా అడుగులు వేస్తూ వస్తున్నాడు. రోజలిండ్ ఏదో తన్మయతలో వుంది. ఆమె లేచి “అడుగో వస్తున్నాడు, ధవళకాంతితోవస్తున్నాడు, మీరు చూశారా! అతడు బుద్ధుడు, బుద్ధుడు” అని అరిచి కుర్చీలో కూలబడింది. ఆ మీదట ఏం జరిగిందో ఆమెకు తెలియదు.

ఆరోజు కృష్ణమూర్తి పరివర్తన దశకు నాంది. అతని అంతశ్చేతనంవికసించింది.అవగాహన కుదిరింది. సత్యం గోచరించింది. ప్రేమ ప్రజ్వరిల్లింది. వెలుగు దర్శించాడు. కరుణ స్పృశించాడు. స్పందించే అగ్నికణమైనాడు. అదియొక వినూత్న పరిణామం. అప్పటినుండి ఆలాంటి అనుభవాలు తరచు కలుగుతూ వున్నాయి. పగలనక రాత్రనక పరిణామ ప్రక్రియ కొనసాగుతున్నది. ఆవేదన ఆంతర్యం తెలియడంలేదు. దైహిక క్లేశం అవసరమని ఆనిబెసెంట్, లెడ్‌బీటర్లుఅనడంలేదు. అయితే అది కాంక్షించడంవల్ల కలగడంలేదు. ఎదురుచూస్తే వచ్చేదికాదు.

కృష్ణమూర్తి మిత్రబృందంతో కొంతకాలానికి ఓహై నుండి ఆస్ట్రియాలో యెర్వాల్డ్‌కు వెళ్లాడు. అక్కడ రెండు నెలలపాటు పరివేదనానుభూతికి గురిఅయ్యాడు. ఒక రోజున అది పరాకాష్ఠపొందింది. అగ్నిలాంటి బాధవెన్నుపూసలో మొదలై మెడలో చేరింది. బాధతో కూడిన జ్వాల రెండుగా చీలి తలకిరువైపులా ప్రాకి భృకుటిలో కలిసింది. కృష్ణమూర్తి స్పృహ కోల్పోయాడు.బుద్ధుని దర్శనమయింది. పరివర్తన స్థిరపడింది. దాని కనుగుణ్యమైన సందేశం చివరి రోజున మైత్రేయ ప్రభువు అందించాడు.

అప్పటినుండి కృష్ణమూర్తిలో నిశ్చలత, గాంభీర్యం, తేజస్సు, దీక్ష, విశాలదృక్పథం. విడుదల, శక్తి కొట్టవచ్చినట్టు పెరిగాయి. అనుయాయులు,అభిమానులు, మిత్రులు అతణ్ణి 'కృష్ణజీ' అని పిలవసాగారు. ఓహైలో తాముంటున్న రెండు భవనాలు కొనుగోలుచేసి, చుట్టూ కొన్ని ఎకరాల భూమిని సేకరించి, 'సోదరుల ట్రస్టు' కు దఖలు పరచి, దానికి 'ఆర్య విహార్' అని పేరుపెట్టారు

## తమ్ముని మరణం

కాలం అనుభూతులతో, ప్రవచనాలతో ప్రశాంతంగా గడుస్తుండగా అడయార్‌లో స్వర్ణోత్సవ మహాసదస్సుకు హాజరు కమ్మని ఆనిబెసెంట్ వర్తమానం పంపింది. నిత్యానందకు ప్రాణాపాయముండదనీ, పరమ గురువుల హామీ వుందనీ ఒకఅభిప్రాయం కలిగింది అమ్మ మాట విని, గురువులపై భారం వేసి నిత్యానందసేవకు రోజలిండ్‌ను, భారతీయ మిత్రుడైన డి. రాజగోపాలాచార్యను నియమించి కృష్ణజీ బయలు దేరాడు. లండనులో ఆనిబెసెంట్‌ను కలిశాడు. వారితోపాటు శివరావు తదితరులు వున్నారు. అందరూ ఓడలో ప్రయాణ మయ్యారు. నౌకాయానంలో రోమ్ సమీపాన వుండగా నిత్యానంద ఆరోగ్యం క్షీణిస్తున్నదని రెండు తంతి వార్తలు వచ్చాయి. రోమ్ దాటాక అతడు (1925 నవంబరు 12 న)మరణించినట్లు మూడవ తంతి వార్త వచ్చింది. అది విన్న కృష్ణజీ ఖిన్నుడైపోయాడు.

గురువులపై విశ్వాసం చెదిరిపోయింది హృదయం వ్రయ్యలయ్యింది. గొంతు మూగవోయింది. ఆవేదన అమితమయ్యింది. నిత్యకై అంగలార్చాడు, నిద్రలో మూలాడు. తెలుగులో మొర పెట్టుకున్నాడు. పడక నుండి లేవలేదు ఎవరితోనూ మాట్లాడలేదు. అట్లా పది దినాలు గడిచాయి. చూసేవారు అవిసిపోయారు, విభ్రాంతి చెందారు, ఆందోళనపడ్డారు. ఓడ కొలంబో చేరింది. దుఃఖాన్ని దిగమ్రింగడానికి కృష్ణజీ పిడికిలి బిగించాడు. జీవితాన్నెదుర్కోడానికి సిద్ధపడ్డాడు. శక్తి పుంజుకోవడానికి ప్రయత్నించాడు. మెల్లగా మాట్లాడాడు. ముఖంలో మార్పు వచ్చింది. నిత్య తనలో కలిసి పోయినట్లు,తాను ద్విగుణీకృత శక్తిమంతుడైనట్లు ప్రకటించాడు. స్థిరుడయ్యాడు.

# ప్రపంచ బోధకుడు

కృష్ణమూర్తి కొలంబో నుండి అడయార్ చేరి స్వర్ణోత్సవ సభలో (1925) నూతనభావాలతో ప్రసంగించాడు. పూర్వం నుండీ వున్న ఆధ్యాత్మిక విధానాలకు విరుద్ధంగా మార్పు నాశించాడు. ప్రపంచ బోధకుడుదయించాడని ఆనిబెసెంట్ ప్రకటించింది. లెడ్‌బీటర్ అభ్యంతరం చెప్పలేదు. ఆ తర్వాత అపుడపుడు సమావేశాలలోను, అంతర్జాతీయ పత్రికల వారితోనూ కృష్ణమూర్తి ప్రపంచ బోధకుడని ఆనిబెసెంట్ ప్రకటిస్తూ వచ్చింది. అంతే గాక తాను కృష్ణజీకి భక్తితత్పరతతో కూడిన శిష్యురాలని అడయార్ సదస్సులో వెల్లడించింది. అయితే జార్జి అరండేల్ మున్నగు వారు కొందరు ఆమె అభిప్రాయాలకు అభ్యంతరాలు లేవనెత్తి, అతణ్ణి విశ్వసించలేదు.

# పరిత్యాగం

ఆనిబెసెంట్, లెడ్‌బీటర్‌లు ఆశించిన రీతిలో కృష్ణమూర్తి విశ్వగురువు కాలేదు. సమస్త విశ్వాసాలను, సర్వవిధానాలను, సకల సంస్థలనూ ప్రశ్నించాడు. అవేవీ సత్యాన్ని నిరూపించలేవనీ, వాటివల్ల సత్యదర్శనం కలగదనీ నొక్కిచెప్పాడు. అంతేగాక 18 సంవత్సరాలు తనను పెద్దచేసి తనకై ప్రచారం చేసిన ప్రాక్డిక్తారా పరిషత్తును ఆనిబెసెంట్ సమక్షంలో ఒమ్మెన్ పేరోలగంలో (1929 ఆగష్టు3న) రద్దుచేశాడు. దానికి సంబంధించిన కోటాను కోట్ల విలువగల ఆస్తిపాస్తులను దాతలకు తిరిగి యిచ్చి వేశాడు. తర్వాత దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వానికి రాజీనామా చేశాడు. అప్పుడు చేసిన ప్రసంగం అద్భుతమైంది. అన్ని రకాలైనబంధనముల నుండీ, సంస్థల నుండీ, విశ్వాసముల నుండీ, నిబద్ధతల నుండీ వైతొలిగాడు. సంపూర్ణస్వేచ్ఛతో సర్వ స్వతంత్రుడైనాడు.

" నేను మార్పు చెందాను. నా మిత్రుల జీవితాలకు మార్పు తెస్తాను......ప్రపంచ పురోగతికి సాయపడతాను. నా అంతరంగమంతా శక్తితో నిండింది......" అని మరోమారు క్రిష్ణజీ వల్కాడు. అతడు కడిగిన ముత్యం లాంటివాడయ్యాడు. ఆనంద సామ్రాజ్యాన్ని చూపిస్తానన్నాడు. తన జీవితం అంతా బోధించడానికి వినియోగిస్తానన్నాడు. అలా విశ్వమానవుడుగా వ్యవహరించసాగాడు.

# ప్రపంచ పర్యటనలు

కృష్ణజీ ప్రపంచంలో పలు ప్రదేశాలు తిరుగుతూ ప్రవచనాలిస్తున్నాడు. అతనికి కొంతకాలం యదునంద ప్రసాద్, తర్వాత రాజగోపాల్, పిదప ఎలైన్‌నాయ్డె, చివరిదాకా మేరీజింబాలిస్టు వ్యక్తిగత కార్యదర్శులుగా పని చేసారు. కృష్ణజీ అమెరికా, ఐరోపా, ఇండియా, శ్రీలంకల్లో పర్యటించి ప్రబోధం చేశాడు తనువు చాలించే వరకు వార్షికంగా ప్రవచనాలు కొన సాగించాడు. అతని విప్లవాత్మక భావాలకు అనుగుణ్యంగా ఇండియాలో మద్రాసు, ఋషివాలి,రాజ్‌ఘాట్ (కాశి), బొంబాయి, బెంగుళూర్‌లోనూ, ఇంగ్లాండ్‌లో బ్రాక్‌వుడ్‌లోనూ, కాలిఫోర్నియాలో ఓహైలోనూ పాఠశాలలు నెలకొన్నాయి. ఆయా పాఠశాలల్లోకూడ ప్రతి సంవత్సరం సమావేశాల్లో మాట్లాడినాడు. పాఠశాల విద్యార్థులకులేఖలు వ్రాశాడు. మొదట "కృష్ణమూర్తి పుస్తక ప్రచురణసంస్థ" వెలిసింది. తర్వాత "కృష్ణమూర్తి ఫౌండేషన్" ద్వారా అతని ప్రసంగాలు వీడియో ఆడియో కాసెట్, పుస్తక రూపాలలో వెలువడుతున్నాయి.

అమెరికాలో పుస్తక ప్రచురణ సంస్థ నిర్వహిస్తున్న ప్రియతమ మిత్రుడైన డి. రాజగోపాలాచార్యతో రగడ ఏర్పడింది. రాజగోపాల్ సర్వాధికారం చెలాయిస్తున్నాడు. ప్రయాణ ఖర్చులకే కాకుండ, ప్రతి విషయంలోనూ కృష్ణజీ అతనికి లోబడేటట్లు చేసుకున్నాడు. అందుచే విరాళదాతల ఒత్తిడివల్ల కృష్ణజీ అతనితో ఆరేళ్ళు కోర్టు వ్యవహారం నడిపి, యాజమాన్య భాగస్వామ్యం పొంది,పుస్తకాదాయం, మరి కొంత ఆస్తి ఫౌండేషన్‌కు చెందేటట్లు చేశాడు. ఆ విధంగా వివాదం పరిష్కారం అయింది. ఈ తగాదా జరుగుతున్నంతకాలం అతడు రాజగోపాల్ యెడ ఔదార్యంతోనూ, ప్రేమతోనూ, నిర్వైరంగా, నిశ్చలంగా మెలిగాడు.

కృష్ణజీ ప్రపంచ పర్యటనల సందర్భంలో ప్రసిద్ధ పురుషులైన రాబిన్‌సన్,జాఫర్‌సన్, రోమ్‌లాండ, ఆంటాయిన్ బర్టెలే, అల్డస్ హక్సలే, డా|| బోమ్,జవహర్‌లాల్ నెహ్రూ, ఇందిరాగాంధి మున్నగు వారికి ఎంతో సన్నిహితుడైనాడు. వారికి మిక్కిలి ప్రీతిపాత్రుడైనాడు.

మొదటి నుండీ చివరిదాక స్వేచ్ఛ, విద్యా ప్రాధాన్యత, సంప్రదాయం - విప్లవం,కృష్ణమూర్తి నోట్ బుక్, అసాధ్యమైన ప్రశ్న, హింసకు ఆవల, కృష్ణమూర్తిజర్నల్, జీవన వ్యాఖ్యానాలు మొదలగు అనేక కృష్ణమూర్తి గ్రంథాలు 30 దాకా వెలువడ్డాయి.

# ప్రబోధాంశాలసారం

"ఉన్నది ఉన్నట్లుగా లేనిది లేనట్లుగా గ్రహించడం సత్యం. ఎప్పటి కప్పుడు,హృదయ పూర్వకంగా గ్రహించబడేదే సత్యం. సత్యం పంథాలేని ప్రదేశం. అదిశాశ్వతమూ కాదు, అశాశ్వతమూ కాదు"

" నేను దేనినీ నమ్మను, నమ్మకం చాల ప్రమాదకరమైంది. నేను మీ జీవితాలకుఅద్దంలాంటి వాడను. మీ జీవితాలను ఆ అద్దంలో చూసుకొని, దాన్ని పారవేయ వచ్చు"

" విజ్ఞానశాస్త్రంగానీ, మానవశాస్త్రంగానీ, అనుభవం నుండి పుట్టిందే. ఆలోచించేవాడే ఆ విజ్ఞానం, ఆలోచనాజ్ఞానంతో సబ్ మెరీన్ను సృష్టించినట్లే దేవుణ్ణి కూడ సృష్టిస్తున్నాడు".

" చావంటే ఏమిటి ? అంటిపట్టుకున్న వాటన్నిటి నుండీ విడివడడం. గతవిస్మరణతో దేనినీ అంటి పట్టుకొనకుండ జీవించడమే - జీవిస్తూ మరణించడం".

" కనిపెట్టడం వేరు, సృష్టించడం వేరు, కనిపెట్టడం జ్ఞానం మీద ఆధారపడివుంది. సృష్టించడం పరిపూర్ణమైన శక్తి. ఒక దాన్ని చంపితే మరొకటి బ్రతుకుతుంది అదే జీవితానికి ఆది. అదే సృష్టికి మూలం. ఇది అద్భుతం "

" ధ్యానమంటే డిసిప్లిన్ కాదు. కొలమానంతో, కోరికలతో లభించేది కాదు. అది ఏకాంతానికి సంబంధించింది. అది అద్భుత భావనాశక్తి ఏకాంతం వేరు, ఏకాకితనంవేరు. ఎల్లపుడూ ఎన్నుకోని ఎరుకతో జీవించాలి అదే నిత్య జాగృతి "

# అంతిమ దర్శనం

కృష్ణమూర్తి 1986 జనవరి 4 న మద్రాను వసంత విహార్‌లో మరణం, ధ్యానం గూర్చి ప్రసంగిస్తూ ఇది చివరి భాషణం అని చెప్పాడు. చివరిలో కొద్దిసేపు శ్రోతలతో మౌనంగా కూర్చున్నాడు. జనవరి 10 న బయలుదేరి కాలిఫోర్నియా వెళ్ళాడు. ఆరోగ్య పరీక్షలో కాలేయంలో క్యాన్సర్ గడ్డ వుందనీ, అది తీవ్రపరిణామం చెందిందనీ వైద్యులు ఖాయ పరిచారు. చరమాంకస్థితుడై వున్నట్లు తనకుతెలిసింది. సమాప్తి కాలనిర్ణయం కూడ తాను చేశాడు. 30 తేదీన ఆసుపత్రి నుండి ఓహై కాటేజికి తిరిగి వెళ్ళాడు. అంతర్జాతీయ ఫౌండేషన్ ప్రతినిధులు 8 మంది పైగా తన చుట్టూవున్నారు.

" ఇది నా అంతిమ దర్శనం, నన్నొక దైవాంశ సంభూతుని చేయకండి....నాకెవరూ భక్తులు లేరు. నాకు స్మారక మందిరాలు, దేవాలయాలు వద్దు. తత్భిన్నంగా చేస్తే నా బోధనలు వృధా అవుతాయి " అని కృష్ణజీ అన్నాడు జీవితంలో ఎల్లప్పుడూ పరిశుభ్రంగా వున్న తన దేహాన్ని మరణానంతరం స్నానం చేయించి, సామాన్య శుభ్ర వస్త్రంతో చుట్టి, కట్టెలాగ అగ్నికి ఆహుతి చేయమనిముందే చెప్పాడు ప్రార్ధనలు, ఆరాధనలు, ప్రసంగాలు, ప్రజాదర్శనాలు వలదన్నాడు.

# తను త్యాగం

అది ఆదివారం సాయంత్రం, ఫిబ్రవరి 16 వ తేది. పరివర్తనకు నాంది పల్కిన చైతన్య వృక్షమైన పెప్పర్ చెట్టు క్రిందికి కృష్ణజీని అతని కోర్కెపై తీసుకొనివెళ్ళారు. పద్మాసనాసీనుడై, ధ్యాన నిమగ్నుడైనాడు. అర్ధ గంట సేపు సంధ్యావిహారం, ప్రకృతి తాదాత్మ్యం పూర్తిచేశాడు. తిరిగి వచ్చాడు. 'ఇది దుఃఖించ వలసింది కాదు. అందరూవెళ్ళి నిద్రపొండి'అని చెప్పాడు. రాత్రి యధావిధిగా నిద్రలోనికి జారుకున్నాడు. అర్ధరాత్రి దాటినాక, అతి సన్నిహితులు లోనికి వెళ్ళి చూచారు. చిరునవ్వు సాక్షాత్కరించింది కాని శ్వాస మాత్రం లేదు, నిత్య చైతన్యుడు నిద్రలోకి జారాడు. నిద్ర సుషప్తినిచ్చింది. సుషప్తి నిశ్చలత నొందింది. అది నిశ్చల నిరీహ నిర్మల నిరంజన తురీయ స్థితి. అప్పటికి 17 వ తేది వచ్చేసింది అది అడయారు దినమవడం ఆశ్చర్యకరం.

కృష్ణమూర్తి భౌతికకాయం మృత్యుశకటంపై శ్మశానస్థలికి పోతున్నపుడు వి - V- ఆకారంలో బాతులు చుట్టివైచినాయి. మేఘాలు గిరులను, లోయను కమ్మివేశాయి. కాలిఫోర్నియా విద్యుద్దహన సాధనంతో దహన ఘట్టం ఒక్కమెరుపుతో పూర్తి అయింది. రెండు గంటల తదుపరి చితాభస్మం దర్శనమిచ్చింది. తక్షణం మేఘాలు చీల్చుకొని వచ్చిన సూర్యుడు భస్మ పాత్రను, శ్మశాన వాటికను,తన సువర్ణచ్ఛాయలతో కప్పి వేసినాడు.

మొత్తం 90 సంవత్సరాల 9 నెలల 5 రోజుల్లో 70 ఏండ్లు నిరాఘాటంగా ప్రతిసంవత్సరం ప్రపంచాన్ని చుట్టి, బహుదూరం పర్యటించి, బహుజనావళితో అరమరికలు లేని ప్రేమ పంచుకొని, వృద్ధాప్యం చివరి రోజు వరకు జగత్ సేవలో,ప్రపంచ బోధకుడుగా జీవించిన ప్రప్రథమ వ్యక్తి అతడే।

అతడు కనుమరుగైనా ప్రవచనాల ద్వారా లోకావగాహనలో వెలుగై వున్నాడు. అతని తుదిపలుకులు మనకు తొలిపలుకులగుగాక।

## ఆ సభలో ఇలా ప్రసంగించాడు

"సత్యానికి మార్గమంటూ లేదు. సత్యం పంథాలేని ప్రదేశం. ఏ మార్గంద్వారాగాని, ఏ మతం ద్వారాగాని, ఏ శాఖ ద్వారాగాని సత్యాన్ని పొందలేరు.....పూర్తిగ దీనికి కట్టుబడి వున్నాను. సత్యం హద్దులకు నిబద్ధతకు లోనుకానిది. కనుక అది సంస్థాగతం కారాదు. ఒక ప్రత్యేక పంథానుబట్టి పొమ్మని ఏ ఒక్కసంఘమూ ప్రజల్ని వత్తిడి చేయరాదు. ఇది గ్రహిస్తే ఒక నమ్మకాన్ని సంఘపరంచేయడం అసాధ్యమని తేల్తుంది. విశ్వాసం కేవలం వ్యక్తిగత మైంది దాన్ని మీరుసంస్థాగతం చేయలేరు, చేయరాదు. చేస్తే అది శవసదృశం అవుతుంది. ఘనీభవిస్తుంది. అంతేగాక అది ఒక విభాగమో, ఒక శాఖో, ఒక మతమో అయితీరుతుంది. ఇతరుల నెత్తిమీద రుద్దాల్సి వస్తుంది"

# సత్యానికి మార్గం లేదు

## TRUTH IS A PATHLESS LAND

1911లో అనిబెసెంట్, లెడ్‌బీటర్‌లు కలిసి 'ది ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఇన్ ది యీస్ట్'అనే ప్రాగ్దిక్తారా పరిషత్తును స్థాపించారు. పదహారేళ్ల కృష్ణమూర్తిని దానికిఅధిపతిగా జేశారు. కృష్ణమూర్తి ప్రపంచ బోధకుడు కానున్నాడని చాటి చెప్పడం వారి ఉద్దేశం. కాని కృష్ణమూర్తి పరివర్తనచెందిన తరువాత దానిని రద్దుచేశారు. మిక్కిలి విలువైన ఆస్తులను దాతలకు తిరిగి ఇచ్చివేశారు. ఆనాడు ఒక మహాప్రసంగం చేశారు. దాని పూర్తి పాఠమిది. ఈనాటికీ సరిపోతుంది.

1929 ఆగష్టు 3వ తేదీ ఆమెన్‌లో (హాలెండ్) పరిషత్తు వార్షిక మహాసభ ప్రారంభమైన రెండవరోజు. సభ వాతావరణం ఉద్విగ్నంగావుంది. రాబోయేమార్పుకు అందరూ ఆందోళన చెందుచున్నారు. అనిబెసెంట్‌కూడ శ్రోతల్లోవున్నారు. మూడువేలకు పైగా సభ్యులు హాజరయ్యారు. వేలాది డచ్‌జనులు రేడియోలో కృష్ణమూర్తి ప్రసంగం వింటున్నారు.

ఈనాటి ఉదయం మనం తారాపరిషత్తు రద్దుపరచడంగూర్చి చర్చించబోతున్నాము. ఇందుకు చాలామంది ఆహ్లాదపడతారు, మిగిలినవారు విచారపడతారు. కాని ఇది సంతోషించే విషయంకాదు, విచారపడవలసిందీ కాదు.ఎందుకంటే ఇది తప్పదు, వివరిస్తాను

ఈ కథ మీకు జ్ఞాపకం వుండివుంటుంది. ఒక దెయ్యమూ, తన మిత్రుడూ వీధిలోనడుస్తున్నారు. వాళ్లముందు ఒక మనిషి వెళ్తున్నాడు. అతడు వొంగి, నేలనుండి ఏదో తీసుకున్నాడు, దానివంక చూశాడు, జేబులో పెట్టుకున్నాడు. 'ఏమిటి అతడేరుకుంది ?' అని మిత్రుడు దెయ్యాన్ని అడిగాడు. 'ఒక సత్యం ముక్కను తీసికున్నాడు' అని దెయ్యం చెప్పింది. 'అయితే, నీకది చెడు అవుతుందికదా !' అన్నాడు మిత్రుడు. 'ఓ, కానేకాదు, దానిపై ఒక సంస్థను నెలకొల్పనిస్తాను' అనిదెయ్యం అన్నది. (సంస్థ పుట్టిందంటే సత్యం వుండదని భావం).

సత్యం మార్గంలేని క్షేత్రం - పంథాలేని ప్రదేశం. నేనలా పరిగణిస్తున్నాను.ఏమార్గం ద్వారాగానీ, ఏ మతంద్వారాగానీ, ఏ శాఖద్వారాగానీ సత్యం దరిజేరలేరు.ఇది నా పూర్ణదృక్పథం. పూర్తిగా, బేషరతుగా దాన్ని అంటిపెట్టుకొని వున్నాను.సత్యం అవధిలేనిది, కట్టుబడనిది, ఏ దారి ద్వారా చేరరానిది, అందుచే అది వ్యవస్థీకృతం కాలేదు. దానికై ఒక ప్రత్యేక మార్గం పట్టి పొమ్మనడానికీ, ఒత్తిడిచేయడానికి ఎలాంటి సంస్థను నిర్మించరాదు. ఇది ముందు అర్థమయితే, ఒకనమ్మకాన్ని సంఘీకృతం చేయడం ఎంత అసాధ్యమో గమనిస్తారు. నమ్మకం కేవలం వ్యక్తిగతమైంది. దాన్ని మీరు సంస్థాగతం చేయలేరు, చేయరాదు.అలాచేస్తే విశ్వాసం శవసదృశమవుతుంది, ఘనీభవిస్తుంది, ఒక శాఖగానో, ఒకవిభాగంగానో, ఒక మతంగానో రూపొందుతుంది. ఇతరులపై రుద్దటానికే పనికొస్తుంది.ప్రపంచంలో ప్రతిమనిషీ అలా చెయ్యాలని యత్నిస్తున్నాడు.సత్యాన్ని సంకుచితం చేశారు, బలహీనులకూ, అసంతృప్తిగలవారికీ ఆటగాజేశారు. సత్యాన్ని క్రిందికి లాగరాదు. మనిషే దానికై పైకి ఎగబ్రాకాలి. గిరి శిఖరాన్నిలోయలోకి తేలేవు. శిఖరం చేరాలంటే లోయనుండి వెళ్ళాలి, భయంకరమైన ఏటవాలు కొండగట్లు దాటాలి, నిర్భయంగా నిట్రలెక్కాలి. సత్యంవైపుకు ఎగబ్రాకాలి. దాన్ని కిందివెుట్లకు ఈడ్చరాదు. నీ కొరకు దాన్ని సంఘటితంచేయరాదు. సంస్థల మూలంగానే అభిప్రాయాలంటే ఆసక్తివుంటుంది. ఆయాసక్తిని బయటనుండి మాత్రమే రగిలిస్తాయి. శ్రద్ధ స్వచ్ఛందంగా కలగాలి.అలా కాకుండా, ఒక సంస్థనుండి వుడితే, దానికి విలువలేదు. సంస్థ ఒక చట్రం,దాంట్లో సభ్యులు అనుకూలంగా ఇమిడిపోతారు. ఇక సత్యానికి పాటుపడరు.వాళ్లకు కొండపైకి పోవాలని వుండదు. వీలుగా ఒక గూటిని తాము మలుచుకుంటారు. దాంట్లో చేరిపోతారు. లేదా సంస్థే తమను అందులోవుంచేటట్లు చేసుకుంటారు. అదే తమను సత్యానికి చేరవేస్తుందని సద్దుకుంటారు.

కాబట్టి నా దృక్పథం ప్రకారం తారాపరిషత్తును రద్దుచేయడానికి ఇది మొదటికారణం. ఐనప్పటికీ బహుశా మీరు సత్యాన్వేషణచేసే ఇతర సంస్థలు స్థాపించుకొంటారు. వాటికి చెందిపోతారు. నాకు మాత్రం ఆధ్యాత్మికంగావుండే ఏ సంస్థకు చెందాలనిలేదు. దయచేసి ఇది గ్రహించండి. కాని ఒక రవాణాసంస్థ,లండన్ తీసికెళ్తుందనుకోండి, దాన్ని వాడుకుంటాను. ఉదాహరణకంటున్నాను. అది పూర్తిగా వేరువిధమైన

సంస్థ, కేవలం యాంత్రికమైంది పోస్టల్‌సంస్థ లేక టెలిగ్రాఫ్ సంస్థలాంటిది అలాగే మోటారు బండిని గానీ, పొగవోడను గానీ ఉపయోగించుకుంటాను ఇవన్నీ భౌతిక యంత్రాలు. ఆధ్యాత్మిక స్వభావంతో ఏమాత్రమూ సంబంధం లేనివి. కనుక ఏ సంస్థకూడా మనిషిని ఆధ్యాత్మికతకు కొనిపోలేదని పునరుద్ఘాటిస్తున్నాను.

ఆధ్యాత్మిక ఆశయంతో ఒక సంస్థను స్థాపిస్తే అది గుదిబండవుతుంది, ఒక బలహీనతవుతుంది, ఒక బంధమవుతుంది. అది తప్పనిసరిగా మనిషిని అవిటివాణ్ణి చేస్తుంది. పైగా పెరుగుదలకూ, ప్రత్యేకతకూ అవరోధం కలిగిస్తుంది. ప్రత్యేకత పరిపూర్ణ సత్యం కనుగొనడంలోనే వుంది, అనిబద్ధమైన సత్యం సొంతంగా కనుగొనడంలోనే వుంది. కాబట్టి పరిషత్తును రద్దుచేయడానికి అదొకకారణం, పరిషత్తు అధ్యక్షుడిగా ఆ నిర్ణయానికి వచ్చాను. నన్నెవరూ అందుకు పురికొల్పలేదు.

ఇది ఘనకార్యంకాదు. ఎందుకంటే నాకు అనుచరులు అక్కరలేదు. బుద్ధిపూర్వకంగానే అంటున్నాను. ఒకరిని అనుసరించడం ఆరంభిస్తే, సత్యానుసరణం నుండి ఆగిపోతాము. నే చెప్పేదానిపై మీకు శ్రద్ధవున్నా, లేకపోయినా నేను పట్టించుకోను. ఈ లోకంలో నాకేదో చేయాలనివుంది. ఊగిసలాడకుండా, ఏకాగ్రంగా చేయబోతున్నాను. నాకున్నది ఒకే ఒక్కటి, ఆవశ్యకమైంది. మనిషిని విముక్తం చేయడమే. అన్ని పంజరాలనుండీ, అన్ని భయాల నుండీ మనిషిని విడుదల చేయాలనివుంది. మతాలనూ, కొత్తశాఖలనూ ప్రతిష్ఠించాలని లేదు కొత్త సిద్ధాంతాలనూ, కొత్త తత్వాలనూ స్థాపించాలనీ లేదు. అయితే నేనెందుకు ఎడతెరపి లేకుండా ప్రవచనలిస్తూ, ప్రపంచం చుట్టి తిరుగుతున్నానని సహజంగా మీరు ప్రశ్నిస్తారు. ఏకారణంవల్ల నేనిది చేస్తున్నానో మీకు చెపుతాను. ఒక అనుసరణ కావాలనీకాదు, ఒక ప్రత్యేక శిష్యవర్గాన్నాశించీ కాదు. (మానవుల్లో వ్యత్యాసాలు ఎంత హాస్యాస్పదంగానూ, ఎంత అసంబద్ధంగానూ, ఎంత స్వల్పంగానూ వున్నా, వారు తమతోటి వారితో ఎంత భిన్నంగా వుండాలని కోరతారోకదా ! అట్టిఅసంబద్ధతను ప్రోత్సహించాలని నాకులేదు. నాకు శిష్యులులేరు, అపోస్తలులులేరు – ఈ భూమ్మీదగానీ, ఆధ్యాత్మిక రాజ్యంలోగానీ.

ధన ప్రలోభంగానీ, సుఖజీవనలాలనగానీ నన్నాకర్షించడం లేదు. సుఖ జీవితం గడపాలనుకుంటే, ఈ క్యాంపుకు వచ్చేవాడినికాదు, లేక ఒక శీతల దేశంలోనివసించే వాడ్నికాదు. నేను మనసు దాచకుండా మాట్లాడుతున్నాను.ఎందుకంటే ఇది ఇంతటితో, ఇప్పుడే తేలిపోవాలనివుంది. ఏటేటా ఈ పిల్లతనపు చర్చలు నాకక్కరలేదు.

వేలకువేల మంది సభ్యులున్న ఒక సంస్థను ఎత్తివేయడం ఒక ఘనకార్యమని నన్ను కలసిన ఒక పత్రికా విలేఖరి పరిగణించాడు. అతనికి ఇదొక మహాకార్యం, ఎందుకంటే, ఇలా అన్నాడతడు "తర్వాత ఏంచేస్తారు? ఎలాబ్రతుకుతారు? మీకుఅనుచరులుండరు, జనం ఇక మీమాట వినరు" జీవించేవారూ, శాశ్వతత్వం వైపు ఉన్ముఖులైన వారూ అయిదు మంది వున్నాచాలు. అర్థం చేసికోని వారూ, పూర్తిపక్ష పాతంతో వుండి పైకి పరిమళించే వారూ, నవ్యత కోరని వారూ, తమ నిష్ఫలత్వానికి అను గుణ్యంగా కొత్తదాన్ని మలచుకొని వాడుకొనేవారూ,స్తంభించి పోయిన జీవులూ వేలాది మంది వున్నా ప్రయోజనం ఏమిటి? నేను ఘాటుగా మాట్లాడితే, దయచేసి అపార్థం చేసుకోవద్దు, నిర్దయగామాట్లాడడం కాదు. శస్త్ర చికిత్సకని సర్జన్ వద్దకు వెళ్తే, బాధ కలిగించినా అతడు ఆపరేషన్ చేసేది దయతోనే కదా! కాబట్టి, అదే విధంగా, నేను సూటిగా మాట్లాడితే, నిజంగా ప్రేమ లేక కాదు - తద్భిన్నంగానే.

నేను చెప్పినట్లు, నాకు ఒకే వుద్దేశముంది : మనిషిని స్వేచ్ఛావంతుణ్ణి చేయడం, స్వాతంత్ర్యం వైపుకు ప్రేరేపించడం, అన్ని పరిమితులూ బ్రద్దలుచేయడానికి సహాయ పడడం, ఎందుకంటే, అది మాత్రమే అతనికి శాశ్వత సౌఖ్యాన్నిస్తుంది, తన పట్ల అనిబద్ధమైన ఎరుక నిస్తుంది.

నేను స్వేచ్ఛగా, కట్టుబడకుండా, పరిపూర్ణంగా వున్నాను గనుక - పాక్షికంగా,సాపేక్షికంగా గాక, శాశ్వతమైన పూర్ణ సత్యంగా - నన్ను అర్థం చేసికోవాలని అపేక్షించేవారు స్వతంత్రులు కావాలని కోరుతున్నాను. నన్ను అనుసరించమనిగానీ ఒక మతమో, ఒక శాఖో అయ్యే గుహను నా నుండి తయారు చేయమని గానీ కాదు. కాక పోతే, వాళ్ళు అన్ని భయాల్నుండీ విముక్తి చెందాలి - అనగా మతభయం నుండీ, రక్షణ భయం నుండీ, ఆధ్యాత్మిక భయం నుండీ, ప్రేమ భయంనుండీ, మరణ భయం నుండీ, చివరికి జీవిత భయం నుండి కూడా విముక్తి చెందాలి. కళాకారుడు

ఒక చిత్రం వేస్తున్నట్లు నేనిలా చేస్తున్నాను ఎలాగంటే, అతడు ఆ చిత్రణలో ఆనందం అనుభవిస్తాడు, అందులో అతని స్వీయ ప్రకటన, స్వీయమహిమ, స్వీయ సంక్షేమం వున్నాయి. అలాగే నేనూ చేస్తూనాన్ను, ఎవరినుండీ ఏమీ ఆశించి కాదు

మీరు అధికారానికి అలవాటు పడ్డారు, లేక అధికార వాతావరణానికి అలవాటుపడ్డారు. అది ఆధ్యాత్మికతకు దారి తీస్తుందని తలస్తున్నారు. ఇతరుడు తనఅసాధారణ శక్తుల ద్వారా - మహిమ ద్వారా - సౌఖ్యమను శాశ్వత స్వేచ్చారాజ్యానికి రవాణా చేస్తాడని యోచిస్తున్నారు, ఆశిస్తున్నారు. జీవితం పట్ల మీ దృక్పథమంతా, ఆ అధికారం మీద ఆధారపడింది.

నే చెప్పింది ఇప్పటికి మూడేళ్ల నుండి విన్నారు, ఏ బహు కొద్ది మందిలోనో తప్ప, మిగతా వారిలో ఏ మార్పు రాలేదు నే చెప్తున్నది ఇపుడు విశ్లేషించండి,విమర్శించండి, తద్వారా సంపూర్ణంగా, సమూలంగా అర్థం చేసుకోవచ్చు. ఆధ్యాత్మికతకు దారి తీసేందుకు అధికారానికి ఎదురు చూసినపుడు, ఆ అధికారంచుట్టూ మీరు ఒక సంఘాన్ని యాంత్రికంగా నిర్మాణం చేయడానికి బద్ధులైపోతారు. ఆధ్యాత్మికతకు దారి తీస్తుందని, ఈ అధికారానికి సహాయ పడడానికి చేసే సంఘ నిర్మాణం ద్వారానే ఒక గూటిలో చిక్కుకు పోతారు

నేను నిర్మొగమాటంగా మాట్లాడితే, - నేనలాగే చేస్తా, దయచేసి గుర్తుంచు కోండి -అదికారిన్యం వల్ల కాదు, క్రూరత్వం వల్ల కాదు, నా ఉద్దేశ పుటభినివేశం వల్ల కాదు, మరెందు కంటే నే చెప్పేది మీరు అర్థం చేసికోవాలని మాత్రమే. ఆకారణం వల్లనే మీరిక్కడున్నారు, నా దృక్పథం స్పష్టంగా, నిర్ణయాత్మకంగా వివరించక పోతే కాలం వృధా చేయడ మవుతుంది

ఈ సంఘటన నిమిత్తం, ప్రపంచ ప్రబోధకుని రాక నిమిత్తం పద్దెనిమిదేళ్ల నుంచి తయారవు తున్నారు, పద్దెనిమిదేండ్ల పాటు సమీకృత మయ్యారు. మీహృదయాలకూ మనస్సులకూ నూతనోత్సాహం ఇచ్చే వాడి కొరకూ, మీ మొత్తంజీవితం పరివర్తన చేసే వాడికొరకూ, నూతన అవగాహన ఇచ్చే వాడికొరకూ, నూతనప్రోత్సాహం ఇచ్చే వాడి కొరకూ,

ఆ నమ్మకం ఏం మార్పు తెచ్చిందో కనుగొనండి. బాడ్జీలు ధరించడంలో వుండే పైపై మార్పు కాదు, అది స్వల్పం, అసంబద్ధం. ఆ నమ్మకంఏవిధంగా నైనా జీవితంలో అనవసర విషయాలను తుడిచేసిందేమో చూడండి. తీర్పుచెప్పడానికి అదొక్కటే మార్గం మీరు మరింత స్వేచ్ఛనూ, ఘనతనూ పొందారేమో చూడండి. అసత్యంపై నిలిచిన సంఘాన్నెదుర్కోగలిగారా? అనవసరమైన వాటిపై ఆధారపడ ప్రతి సమాజానికీ మీరంటే ప్రమాదకరంగావుందా లేదా? తారా పరిషత్ సభ్యులుగా మీరేమైనా వేరుగా వున్నారేమోచూసుకోండి.

ముందు చెప్పినట్లు, మీరు నా గురించి పద్దెనిమిదేండ్ల నుండి తయారవుతున్నారు. నేను ప్రపంచ బోధకుడనయ్యానో, కాలేదో అనే విషయంలో మీనమ్మకంతో నాకు పనిలేదు. అది అప్రధానం కృష్ణమూర్తి ప్రపంచ బోధకుడని మీరు తారా పరిషత్తుకు చెందిన వారుగా పాక్షికంగానో, పూర్తిగానో సానుభూతి, శక్తిఅందించారు. నిజంగా అన్వేషించిన వారు పూర్తిగానూ, అర్ధసత్యాలతో తృప్తిపడ్డవారు పాక్షికంగానూ సానుభూతి చూపారు.

మీరు పద్దెనిమిదేళ్లనుండి తయారవుతున్నారు, అర్థంచేసికొనే మార్గంలో ఎన్ని కష్టాలున్నాయో, ఎన్ని సంకీర్ణాలు, ఎన్ని స్వల్ప విషయాలున్నాయో చూడండి. మీ పాక్షికతలు, మీ భయాలు, మీ అధికారాలు, మీ చర్చిలు-కొత్తవీ పాతవీ - ఇవన్నీ అవగాహనకు అవరోధమని నే పరిగణిస్తున్నాను. ఇంతకంటే నన్ను నేను స్పష్టతరం చేసుకోలేను. నాతో అంగీకరించమని మిమ్ముకోరడంలేదు. నన్ను అనుసరించమనీ కోరడంలేదు. నేచెప్పేది అర్థంచెసికోమని కోరుతున్నాను.

ఈ అవగాహన అవసరం; ఎందుకంటే, మీ నమ్మకం మిమ్ముల్ని మార్చకపోగా,సంక్లిష్ట పరిచింది, ఉన్నవి ఉన్నట్లుగా చూడడానికి మీరు సమ్మతించడంలేదు. మీ దేవుళ్లు మీకు కావాలి. పాతదేవుళ్లకు బదులు కొత్తదేవుళ్లు, పాత మతాలకు బదులు కొత్త మతాలు, పాతరూపాలకు బదులుకొత్తరూపాలు - అన్నీ ఒకేరకంగా విలువలేనివే, అన్నీ అవరోధాలే, అన్నీపరిమితులే, అన్నీ బోనులే. మీకు పాత ఆధ్యాత్మిక గొప్పలకు బదులు కొత్త ఆధ్యాత్మిక గొప్పలున్నాయి, పాత ఆరాధనలకు బదులు కొత్త ఆరాధనలున్నాయి. మీ ఆధ్యాత్మికత నిమిత్తం మీరందరూ

మరెవరిమీదో ఆధారపడుతున్నారు. మీ సౌఖ్యం నిమిత్తమూ, మీ సిద్ధినిమిత్తమూ పరులపైఆధారపడుతున్నారు. పద్దెనిమిదేండ్లనుండి మీరు నా గురించి తయారవుతున్నారు; అయినా ఇవన్నీ అనవసరమనీ వీటన్నిటినీ ప్రక్కనపెట్టాలనీ, చెప్పినా మీరు వినడంలేదు. వెలుగుపొందడానికీ, మహిమకొరకూ, పవిత్రీకరణకొరకూ, ఆత్మనీతి తప్పకుండా వుండేందుకూ, తమలోకి తాముఅవలోకించాలని చెప్పినప్పటికీ మీలో ఒక్కరూ అలాచేయడాని కిష్టపడడం లేదు. కొద్దిమంది వుండొచ్చు, చాలా తక్కువమంది, మరీ తక్కువమంది

ఇంకా సంఘనిర్మాణమెందుకు ?

మూర్తీభవించిన సత్యమైన నన్ను అబద్ధీకులు, వంచకులు అనుసరించుటెందుకు ? దయచేసి గుర్తుంచుకోండి, నేనేదో కఠినంగా, నిర్దయగాచెప్పడంలేదు మనమొక పరిస్థితికివచ్చాం, ఆస్థితిలో ఉన్నవి ఉన్నట్లుగా చూడాల్సినఅగత్యముంది నేనురాజీపడనని గత సంవత్సరం చెప్పాను అప్పుడు నా మాట విన్నవారు చాలా తక్కువమంది ఈ సంవత్సరం పూర్తిగా విస్పష్టం చేశాను. ప్రపంచమంతటా ఎన్నివేలమంది - పరిషత్ సభ్యులు - నా కొరకు పద్దెనిమిదేండ్లనుండి పాటుపడుతున్నారో నాకు తెలియదు ఇప్పటికీ నే చెప్పేది వాళ్ళు అనిబద్ధంగా, సంపూర్ణంగా వినడానికి ఇష్టపడడంలేదు.

కాబట్టి ఇంకా సంఘమెందుకు ?

నేను ముందు చెప్పినట్లు, మానవులు బేషరతుగా స్వేచ్ఛ పొందేటట్లుచేయడమే నా వుద్దేశం ఎందుకంటే - ఆత్మ - అవినీతిమయం కాకుండడమే ఆధ్యాత్మికత యని నొక్కిచెప్పుతున్నాను; అది శాశ్వతమూ, హేతుప్రేమల మధ్య సామరస్యమూన్నూ ఇది సంపూర్ణమైన, అనిబద్ధమైనసత్యం. అదే జీవితం. కాబట్టి నిర్మలాకాశంలోని విహంగంలాగ సంతోషిస్తూ మానవుడు స్వేచ్ఛనొందాలని నేకోరుతున్నాను. భారరహితంగా, స్వతంత్రంగా, ఆ స్వేచ్ఛలో తన్మయత్వం చెందాలి. నా గురించి మీరు పద్దెనిమిదేండ్ల నుండి తయారవుతున్నారు, నేను ఇప్పుడు వీటన్నిటి నుండీ, మీ సంక్లిష్టతల నుండీ, మీబంధాల నుండీ స్వేచ్ఛ పొందమని చెప్తున్నాను. దీన్నిమిత్తం

మీకు ఆధ్యాత్మిక విశ్వాసంపై ఆధారపడ్డ సంస్థ అవసరం లేదు. ప్రపంచంలో స్వల్ప విషయాలనువదలి అర్థం చేసికొని, పోరాడే ఐదుగురు లేక పది మందికి ఒక సంస్థ ఎందుకు ? ఇక సత్యం కనుగొనే నిమిత్తం బలహీనులకు సాయపడడానికి సంఘమే వుండక్కరలేదు, ఎందుకంటే సత్యం ప్రతివానిలోనూ వుంది, అది దూరంగానూ లేదు దగ్గిరిగానూ లేదు, అది నిత్యం.

సంస్థలు మిమ్ము స్వతంత్రులను జేయ లేవు బయటి నుండి ఏ మనిషీ స్వేచ్ఛనొసగలేడు; సంఘటిత ఆరాధన గానీ, ఒక సమస్యకై జేసికొనే ఆత్మాహుతి గానీ స్వేచ్ఛ నివ్వలేదు, ఒక సంస్థగా మీరు నిర్మాణం కావడంగానీ, ఆయా పనుల్లో మీరు మునిగి పోవడంగానీ, మిమ్ము స్వతంత్రులను జేయలేవు. అక్షరాలు రాయడానికి టైపురైటరు వాడతారు, కాని దాన్ని ఒక పీఠం మీద పెట్టి, పూజించరు. అయితే సంస్థలు మీ ముఖ్య అవసరాలయినపుడు, మీరదే చేస్తున్నారు. "సంస్థలో ఎంత మంది సభ్యులున్నారు?" ఇది పత్రికా విలేకరులందరూ నన్నడిగేమొదటి ప్రశ్న. "మీకెందరు అనుచరులున్నారు ? వాళ్ళ సంఖ్యను బట్టి,మీరు చెప్పేది నిజమో, అబద్ధమో తీర్మానిస్తాము" - అంటారు. ఎందరున్నారోనాకు తెలియదు. దాంతో నాకు నిమిత్తం లేదు. నేను ముందుగా చెప్పినట్లు,స్వేచ్ఛ పొందిన మనిషి ఒక్కడున్నా, అంతే చాలు.

ఇకపోతే, సౌఖ్య సామ్రాజ్యపు తాళపు చెవి ఏకొందరి చేతుల్లోనో వుందని మీఅభిప్రాయం. నిజానికది ఎవరి చేతిలోనూ లేదు. దాన్ని చేజిక్కించు కోడానికి ఎవరికీ అధికారం లేదు. ఆ తాళము నీ సొంత ఆత్మే, నీ అంతరంగమే. దానిపెరుగుదలలోనూ, దాని పవిత్రీకరణంలోనూ, అది అవినీతిమయం కాకుండడంలోనూ మాత్రమే నిత్య సామ్రాజ్యం ఉంది.

కాబట్టి బయటి సహాయానికి ఎదురు చూస్తూ, మీహాయికి-సౌఖ్యానికి-బలానికిఇతరులపై ఆధార పడుతూ మీరు కట్టిన నిర్మాణం మొత్తమూ ఎంత అసంబద్ధమైందో మీకే తెలుస్తుంది. వీటిని మీ అంతరాత్మల్లో మాత్రమే చూడ గలరు. కాబట్టి ఇంకా సంఘమెందుకు ?

మీరెంత పురోభివృద్ధి చెందారో, మీ ఆధ్యాత్మిక స్థాయి ఏమిటో మీరు ఇతరులచేత చెప్పించుకోడానికి అలవాటు పడ్డారు. ఇది ఎంత పిల్లతనం ! నీవు లోపల అందంగా వున్నదీ, అసహ్యంగా వున్నదీ నీవు

తప్పు ఎవరు చెప్ప గలరు ? నీవు అవినీతిమయం కాలేదని నీవు తప్పు ఎవరు చెప్ప గలరు ? ఈ విషయాల్లో మీకు పట్టుదల లేదు.

కాబట్టి ఇంకా సంస్థ ఎందుకు ?

అర్థం చేసికోడానికి నిజంగా కోరేవారూ, ఆది తుదిలేని శాశ్వతమైందాన్ని కనుగోడానికి చూసేవారూ మరింత బలంతో కలిసి నడుస్తారు. వాళ్ళు అనవసరమైన వాటికీ, అసత్యాలకూ, నీడలకూ పక్కలో బల్లెంగా ఉంటారు,అర్థం చేసుకొన్న వారు ఏకాగ్రత వహిస్తారు, అగ్నిజ్వాలలవుతారు. మనంఅలాంటి సముదాయాన్ని సృష్టించాలి. అదే నా ఆశయం ! ఆత్మావగాహనతో యదార్ధ మైత్రి వుంటుంది. అది మీకు తెలిసినట్లు లేదు యదార్ధమైత్రి వల్ల ప్రతివారి నుండి నిజమైన సహకారం వుంటుంది. ఇది అధికారం వల్ల, రక్షణ వల్ల,ఆత్మాహుతి వల్ల కలిగేది కాదు. మీరు నిజంగా అర్ధం చేసికోవడం వల్ల శాశ్వతమైన దానిలో జీవింప సమర్థులవుతారు. ఇది అన్ని ఆహ్లాదాలకూ,అన్ని త్యాగాలకు మించిన గొప్ప విషయం.

కాబట్టి ఇవీ ముఖ్య కారణాలు,

రెండేళ్ళు జాగ్రత్తగా తరచి చూసి, ఈ నిర్ణయానికి వచ్చాను. ఇది క్షణిక ప్రేరణవల్ల కాదు. ఇలా చేయమని నన్నెవరూ ఒత్తిడి చెయలేదు. అలాంటివిషయాల్లో నన్నెవరూ ఒత్తిడి చేయరు. దీన్ని గురించి నేను రెండేళ్ల నుండి నిదానంగా, జాగ్రత్తగా, ఓపిగ్గా ఆలోచిస్తూవున్నాను. కనుక పరిషత్తును రద్దుచేయడానికి, దానికధ్యక్షుణ్ణి కావడం వల్ల, ఇప్పుడు నిర్ణయం గైకొన్నాను. మీరు వేరే సంఘాలు పెట్టుకో వచ్చు, మరొకరికై నిరీక్షించ వచ్చు. దాంతో నాకు ఎలాంటి నిమిత్తమూ లేదు. కొత్త గూళ్ళు నిర్మించడంతోనూ, ఆ గూళ్ళకు కొత్తఅలంకరణలు చేయడంతోనూ నాకు నిమిత్తం లేదు. మనిషిని సంపూర్తిగా,బేషరతుగా స్వేచ్ఛతో విడుదల చేయటమే నా ఏకైక లక్ష్యం.

# తనతో తాను
(ఒక పరిశీలన)

ఈర్ష్య వుంటే ప్రేమ వుండదు. ఇది గ్రహించాను. బంధమున్నపుడు ప్రేమ నిలువజాలదు. ఇదీ తెలిసింది. ఈర్ష్య, బంధమూ లేకుండా నేను స్వతంత్రంగా వుండగలనా? నాకిది సాధ్యమా?

నేను ప్రేమించడంలేదని తెలుసు. ఇది వాస్తవం. కాబట్టి నన్ను నేను మోసగించుకోవాలని లేదు. ప్రేమిస్తున్నట్లుగా నా భార్య వద్ద నటించాలనీలేదు నిజంగా ప్రేమంటే ఏమిటో నాకు తెలియదు. ఈర్ష్యతో వున్నానని మాత్రంతెలుసు. మహాఘోరంగా ఆమె బంధంలో పడ్డాననీ తెలుసు. బంధంలో భయం,ఈర్ష్య, ఆదుర్దా, పరాధీన భావం, వున్నాయని కూడ తెలుసు. ఆధారపడడంనాకిష్టంలేదు. కాని ఒంటరి కావడంవల్ల ఆధారపడుతున్నాను. ఆఫీసులోనో,కర్మాగారంలోనో మగ్గిపోయి ఇంటికి వస్తాను. ఏమీ తోచదు, నా నుండి నేనుఎలా తప్పించుకోవాలా అని చూస్తాను. అవుడు నాకు తోడు, నీడ, ఊరట కావాలనిపిస్తుంది దాంతో బంధం ఏర్పడుతుంది. ఈ బంధం నుండి విడుదల పొందడం ఎలా అని నన్ను నేను ప్రశ్నించుకుంటున్నాను. ఇది (భార్యా బంధం)ఒక ఉదాహరణ మాత్రమే.

మొదట ఈ ప్రశ్నే ఇబ్బందిగా వుంది. అందుకని ఈ ప్రశ్న నుండి పారిపోతే సరిపోలా అనిపిస్తుంది. నాకూ నా భార్యకూ మధ్య ఎలా జరుగనున్నదో తెలియదు. నిజంగా నేనామె లంపటం నుండి తొలిగినపుడు మా సంబంధంలో మార్పు రావచ్చును. ఆమెకు నాపై తాపత్రయం వుండొచ్చు, నే నామెపై గానీ ఇతర స్త్రీలపైగానీ తాపత్రయం పడకపోవచ్చు. కాని నేను పరిశోధించబోతున్నాను.కాబట్టి అన్ని బంధాల నుండీ పూర్తిగా తొలిగినపుడు ఏ పర్యవసానం జరుగుతుందని ఊహించుకొంటున్నానో, దాన్నుంచి నేను పారిపోను.

ప్రేమంటే ఏమిటో నాకు తెలియదు. కాని భార్యాబంధమంటే ఈర్ష్య, స్వాధీనం,భయం, ఆదుర్దా అని బాగా స్పష్టంగా, ఖాయంగా, నిస్సందేహంగా తెలుస్తోంది అన్నింటి నుండీ నాకు స్వేచ్ఛ కావాలి. అందుకు పరిశోధన ప్రారంభించాను.అవుడొక పద్ధతికి ఎదురుచూశాను. ఒక విధానంలో చిక్కుకుపోయాను. ఒకగురువు "నీవు బంధవిముక్తుడవు

కావడానికి నేను సాయపడతాను ఇలా, ఇలాచెయ్యి. అలా, ఇలా అభ్యాసం చెయ్యి'' అంటాడు. స్వేచ్ఛ యొక్క ప్రాముఖ్యం తెలుసు కాబట్టి గురువు చెప్పింది అంగీకరిస్తాను. పైగా చెప్పింది చేస్తే, ప్రతిఫలం వుంటుందని అతడు వాగ్దానం చేస్తున్నాడు ఆ విధంగా నేను ప్రతిఫలం కొరకుఎదురుచూస్తున్నాను. ఇది శుద్ధబుద్ధిహీనతగా తోస్తుంది. స్వేచ్ఛగా వుండాలనే కోరికతో ఒక ప్రతిఫలాపేక్షలో తగుల్కొంటున్నాను.

బంధంలో పడాలని లేక పోయినా, ఏ వ్యక్తో, ఏ పుస్తకమో, ఏ విధానమో బంధవిముక్తి అనే బహుమతి ప్రదాన వాగ్దానం చేయడంవల్ల, నేను దానికి బందీనై పోతున్నాను. కాబట్టి బహుమతి మరో బంధమయింది ''చూడు నేనేం జేశానో, జాగ్రత్తగా వుండు, ఆ బోనులో చిక్కుకోవద్దు'' అని నన్ను నేను హెచ్చరించుకొన్నాను. స్త్రీగాని, విధానంగాని, వుద్దేశంగాని-ఏదైనా బంధమే.ఇప్పుడు నేను చాలా మెలకువగా వున్నాను. ఎందుకంటే నేను కొంతనేర్చుకున్నాను అనగా, ఒక బంధానికి బదులు మరో బంధంలో పడకుండా వుండడం.

"బంధ విముక్తుణ్ణి కావడానికి నేనేం చెయ్యాలి? అని నన్ను నేను అడుగుతున్నాను. బంధవిముక్తి కోరడంలో నా ఉద్దేశమేమిటి? బంధం, భయంవగైరాలు లేని స్థితి సాధించాలని కాంక్షించడంకాదా? ఆ ఉద్దేశం ఒక మార్గాన్ని స్తోందనీ, ఆ మార్గం నా స్వేచ్ఛను నిర్దేశిస్తోందనీ తృటిలోగ్రహించాను. ఒక వుద్దేశం నాకెందుకుంది? ఉద్దేశమంటే ఏమిటి? ఉద్దేశమంటే ఏదో సాధించాలనే ఒక ఆకాంక్ష లేక ఒక కోరిక.

నేను ఒక ఉద్దేశానికి బద్ధుడనైపోయానని అనిపిస్తోంది. నా భార్య, (భార్యబంధం తొలగించుకోవాలనే) నా అభిప్రాయం, (దానికి గురువు చెప్పిన) విధానం మాత్రమేగాక నా ఉద్దేశం కూడ బంధమయింది. కాబట్టి, (తీరా చూస్తే) నిరంతరమూ నేను బంధమనే కార్యరంగంలోనే పనిచేస్తున్నాను-అంటే నా భార్య, ఆ పద్ధతి, ముందేదో సాధించాలనే వుద్దేశం. వీటన్నింటికీ నేను బద్ధుడనయ్యాను.ఇది మహా సంక్లిష్టంగా వుండడం గ్రహించాను. బంధం నుండి స్వేచ్ఛపొందాలంటే, ఇంత గొడవవుందని నాకు ముందు తెలియలేదు. ఒక పటంలో ప్రధాన మార్గాలూ, పక్కదారులూ, గ్రామాలూ కనపడుతున్నంత స్ఫుటంగా ఇప్పుడిది చూస్తున్నాను. చాలా స్పష్టంగా చూస్తూన్నాను. "ఇక, నా భార్యతో వున్న మహాబంధం నుండీ, రానున్నదనుకొనే బహుమానం

నుండీ, నా ఉద్దేశం నుండీ విడుదల కావడంసాధ్యమా?'' అని మళ్లీ ప్రశ్నించుకొంటున్నాను. అసలు వీటన్నిటితో ఎందుకు బంధం పెట్టుకున్నాను? నాలో నాకు కొరత ఉండడం వలనా? నేను మరీ ఏకాకిని కావడం వలనా? కాగా, మానసికంగా దూరంకావడం నుండి తప్పించుకోజూచి ఒకస్త్రీ వైపుకో, అభిప్రాయానికీ, వుద్దేశానికో తలవొగ్గడం వలనా? దేన్నో ఒకదాన్ని తప్పకుండా పట్టుకోవలసిందేనా! అలాగే కనిపిస్తుంది. నేను ఒంటరివాడిని, అంచేత అసాధారణమైన ఏకాకిత్వపు సంవేదన నుండి ఏదో ఒకబంధం ద్వారా తప్పించుకొంటున్నాను.

కాబట్టి నేను ఒంటరినెందుకు అయ్యానో అర్థం చేసుకోవాలని శ్రద్ధ కలిగింది, ఎందుకంటే ఒంటరితనమే బంధం తెచ్చిపెడుతున్నదనీ తెలుస్తోంది. ఏదో ఒక బంధం ద్వారా తప్పించుకోమని ఒంటరితనమే నన్ను ఒత్తిడి చేస్తోంది. ఒంటరిగానున్నంతకాలం పర్యవసానమింతే ఒంటరిగా వుండడమంటే అర్ధమేమిటి? అదిఎలా సంభవిస్తుంది? అది స్వతస్సిద్ధమా? వారసత్వమా? అది నా దైనందిన కార్యకలాపం వల్ల వచ్చేదా? అది సహజాతమైనా వారసత్వమైన నా ప్రాప్తంలో భాగమే,నిందించ తగను. కాని అలా నేనుఅంగీకరించడంలేదు. ప్రశ్నిస్తున్నా, ప్రశ్నతో వుంటున్నా. నేను గమనిస్తూవున్నాను. తెలివితేటల్తో కూడిన సమాధానానికి ప్రయత్నించడంలేదు. ఒంటరితనం ఏంచెయ్యాలో, లేక అదేమిటో నేను దానికి చెప్పాలని యత్నించడంలేదు.అదే నాకు చెప్పాలని వేచి చూస్తున్నాను. తన నిజస్వరూపం తానే బయటపెట్టేందుకు ఒంటరితనంపై ఒక నిఘా వుంది. నేను పారిపోయినా,భయపడినా, నిరోధించినా తన నిజస్వరూపం ప్రదర్శన చేయదు. అందుకనిగమనిస్తున్నాను. ఏ ఆలోచనా జోక్యం చేసికోకుండేందుకు గాను గమనిస్తున్నాను. ఆలోచన ప్రవేశించేదాని కన్నా, గమనించడం మిక్కిలి ముఖ్యం. ఒంటరితనాన్ని పరిశీలించడంలోనే నాశక్తి అంతా మునిగివున్నదికాబట్టి ఆలోచన రానేరాదు. మనసుకు ఇది సవాలు, అది సమాధానం చెప్పాలి.సవాలు వల్ల అది సంక్షోభంలో పడింది. సంక్షోభంలో గొప్ప శక్తి విడుదల అవుతుంది. ఆ శక్తికి ఆలోచన అంతరాయం వుండదు. ఇది ఒక సవాలు. దీనికి జవాబు దొరికి తీరాలి.

విషయాలూ రాస్తారు. అసలు ప్రేమనేది వుందా?-ఇదీ నా ప్రశ్న. ఈర్ష్య, ద్వేషం, భయం వున్నపుడు ప్రేమ లేదు. ఇదిసుస్పష్టం. ఇక నాకు ప్రేమతో ప్రమేయం లేదు. నా ప్రమేయం, 'వున్నదేమిటో',దాంతోనే-అంటే నా భయం, నా బంధం. బంధంలో ఎందుకు పడ్డాను? నిరాసతో ఒంటరికావడంవల్లా, దూరం కావడంవల్లా. ఇది ఒక కారణం. ఇది పూర్తి కారణం కాకపోవచ్చు. పెద్దైన కొద్దీ పెద్దగా దూరమౌతున్నాను. కాబట్టి, గమనిస్తున్నాను. దాన్ని కనుగొనడం నాకొక సవాలు. ఇది సవాలు కాబట్టి. స్పందించడానికి శక్తి అంతా వుంది. అది సామాన్యం. ఏ విపత్తో, ఒక ప్రమాదమో,అదేదైనాసరే వుంటే, అది ఒక సవాలు. దాన్నెదుర్కోడానికి నాకు శక్తి వుంది. ఈశక్తి నాకెలా వస్తుంది?'' అని నేనడగక్కర్లేదు ఇంటికి నిప్పంటుకొన్నపుడు,కదిలిపోడానికి నాకు శక్తివుంది, అసాధారణమైన శక్తి. ''సరే, ఈ శక్తి నాకు రానీ''అని చెప్పి, వెనక కూర్చోను, వేచిచూడను, ఆ లోపుగా ఇల్లు మొత్తం కాలిపోతుంది.

కాబట్టి ఈ ప్రశ్నకు బదులు చెప్పడానికి గొప్పశక్తి వుంది. ఈ ఒంటరితనం ఎందుకుంది? వారసత్వంగా, సహజాతంగా వుండే భావాలు, వ్యూహాలు,సిద్ధాంతాలు తోసివేశాను. నాకవి అర్థంలేనివి. ఒంటరితనమే 'ఉన్నట్టిది' పైపైనగానీ, గాఢంగాగానీ ప్రతిమనిషీ, ఎరుక వహిస్తే మాత్రం, అనుభవించే ఈ ఒంటరితనం ఎందుకువుంది? ఎందుకొస్తుంది? మనసేదో చేస్తుండడంవల్ల ఇదివస్తోందా? సహజానికీ వారసత్వానికి సంబంధంచిన సిద్ధాంతాలు కాదన్నాను. ఇకపోతే, నేనడిగే దేమంటే మనసే (మెదడే) తెచ్చి పెట్టిందా ఈఒంటరితనాన్ని, ఈ దూరంకావడం మొత్తాన్ని? ఆలోచనా గమనమే ఇలాచేస్తోందా? నా దైనందిన జీవితంలో ఆలోచనే దూరమైపోయే భావాన్ని సృజిస్తోందా? ఆఫీసులో నన్ను నేను దూరం చేసికొంటున్నాను, ఎందుకంటే,పైమెట్టు కార్యనిర్వాహకుణ్ణి కావాలని వుంది కాబట్టి. అలా ఆలోచనే తనను దూరం చేసికొంటూ నిరంతరం పనిచేస్తోంది. ఆలోచన ఎల్లప్పుడూ తననుశ్రేష్టతరం చేసికోడానికి పనిచేస్తుందని తెలుస్తోంది. అంటే మనస్సు దానికది ఈ దూరస్థస్థితి (ISOLATION) వైపుకు నడుస్తోంది.

ఇహ ఇప్పుడు సమస్యేమంటే, ఆలోచన ఇలా ఎందుకు చేస్తోంది? దానికై అదిపనిచేయడం ఆలోచన స్వభావమా? దూరంకావడం కల్గించేది ఆలోచన స్వభావమా? చదువు ఈ దూరంకావడం తెచ్చిపెడుతుంది, చదువు నాకొక వృత్తి కల్పిస్తోంది, ప్రత్యేకతనిస్తోంది, కాబట్టి

దూరంకావడం కల్గిస్తోంది. (దాన్నికాపాడుకోటానికి దూరమైపోతున్నాము) ఆలోచన ముక్కలు చేసేదిగా, పరిమితిగా,కాలబద్ధంగా వుంటూ దూరంకావడం కలిగిస్తోంది. ఆ పరిమితిలో తనకు భద్రతవుందంటోంది.

"నా జీవితంలో ఒక ప్రత్యేక వృత్తి వుంది, నేను ఆచార్యుడను, నే నెంతో క్షేమంగా వున్నాను అంటుంది. (అంటే భద్రతనిస్తుందన్న ఈ ప్రత్యేక వృత్తే మనిషి నుండి మనిషిని దూరం చేస్తుంది, ఒంటరితనం కలిగిస్తుంది.) అందుకని, ఆలోచన ఇలాఎందుకు చేస్తోంది అని నాకు పట్టింది. అలా చేయడం దాని స్వభావంలోనేవుందా? ఆలోచన ఏం చేసినా పరిమితమై తీరాలి.

ఇపుడు సమస్య ఇలా వచ్చింది. తానేమి చేసినా పరిమితమనీ, ఛిన్నాభిన్నమనీ, కాబట్టి దూరం చేస్తుందనీ ఆలోచన తెలిసికోగలదా? ఏం చేసినా అంతేననిగ్రహించగలదా? ఇది చాలా ప్రధానాంశం ఆలోచన, తన అవధులను తానే గ్రహించుకోగలదా? లేక అది పరిమితమని నేను దాంతో చెపుతున్నానా? అర్థంచేసికోడానికి ఇది చాలా ముఖ్యమనిపిస్తున్నది, విషయానికిదే నిజంగా సారభూతమైంది. ఆలోచన పరిమితమని దానికది తెలుసుకొంటే, ప్రతిఘటనగానీ, ఘర్షణగానీ లేదు. "అంతేకదానేను" అనుకొంటుంది. కాని అది పరిమితమైందని నేను దానికి చెపుతున్నట్లయితే, అపుడు ఆ పరిమితి నుండి వేరౌతాను. అపుడుఆ పరిమితిని అతిక్రమించడానికి సతమతమౌతాను. ,అంచేత అక్కడ ఘర్షణ, హింస తప్ప ప్రేమ వుండదు.

నేనిప్పుడు కనుగొనాల్సింది ఆలోచన పరిమితమని తనకు తాను తెలుసుకొంటున్నదా? ఇది నాకు సవాలు. సవాలెదురైంది గనుక నాలో గొప్ప శక్తిఉత్పన్నమౌతుంది. మరో విధంగా అందాము. ❖తానే తనలోని

❖ వివరణ . చిత్తమూ, చిత్తంలోని విషయమూ ఒక్కటేనని చిత్తానికి తెలుసా అని.మనసులో ఉన్న సరుకు తానే మనసు తయారయిందని మనసు తెలుసుకొంటున్నదా, లేక 'నేను' అనేది మనసుకు వేరుగా వుండి బలవంతంగా మనసుకు తెలియజేస్తున్నదా? మనసు తనకు తానే తెలిసికోవడం సరళం సహజమని ఇందలిభావం. అంటే ఆలోచన వేరు, నేను వేరు అనుకోగూడదని తెలుస్తోంది.

సరుకని చేతనత్వానికి తెలుసా? లేక ''చైతన్యమే దాని విషయం, ఆ విషయంలో చైతన్యం తయారయింది'' అని ఎవరో చెపితే విన్నానా? కాబట్టే ''అవును, అది అంతే''అంటున్నానా? ఈ రెంటికీ వ్యత్యాసం చూస్తున్నారా? ఆలోచన సృష్టించినరెండోదాన్ని 'నేను' అనేది తెచ్చిపెడ్తోంది. ఆలోచన మీద నే నేదైనా రుద్దితే ఘర్షణేర్పడుతుంది. ఒక నిరంకుశప్రభుత్వం ఒకరిపై తెచ్చిపెట్టినట్లుంటుంది అయితే ఇక్కడ ఆ ప్రభుత్వం నేను సృష్టించుకొన్నదే.

కాబట్టి మళ్లీ ప్రశ్నించుకుంటున్నాను. ఆలోచన తన పరిమితులను గ్రహించిందా? లేక తాను అసాధారణమైందనీ, ఘనమైందనీ, దివ్యమైందనీ నటిస్తోందా? ఇది అర్థరహితం, ఎందుకంటే ఆలోచన జ్ఞాపకం మీద ఆధారపడింది. ఈ అంశం స్పష్టం కావాలని చూస్తున్నాను, ఆలోచనపరిమితమని చెప్తూ దానిపై రుద్దే బయటి ప్రభావమేదీ లేదనేది స్పష్టం కావాలి.అపుడు ఒత్తిడిలేని కారణాన ఘర్షణ లేదు. అది పరిమితమని సరళంగా గ్రహిస్తోంది ఆరాధన నిమిత్తం ఐరోపా అంతటా అద్భుతమైన క్రైస్తవాలయాలు ఆలోచన నిర్మించినప్పటికీ అది, దైవారాధన వగైరా ఏమి చేసినా పరిమితమైందనీ,తొడుగులాంటిదనీ, హీనమైందనీ గ్రహిస్తోంది

కాబట్టి నాతో జరుపుకొన్న నా సంభాషణలో ఆలోచన ఒంటరితనం సృష్టించి దనేది బయటపడింది. ఆలోచన తాను పరిమితమనీ, అంచేత ఒంటరితనపు సమస్యను తీర్చలేదనీ ఇపుడు తనకు తాను గ్రహించింది.అలాంటప్పుడు అసలు ఒంటరితనం వుందా? ఆలోచన ఈ ఒంటరితనపుభావాన్ని, ఈ శూన్యతను సృజించింది, ఎందుకంటే అది పరిమితమైంది,ఛిన్నాభిన్నమైంది, విభాజ్యమైంది. అది ఈ సంగతి గ్రహించినపుడు, ఒంటరితనంలేదు.కాబట్టి బంధం నుండి విముక్తి కలిగింది నేను చేసిందేమీలేదు, బంధాన్ని,దానిలో ఇమిడి వున్న దాన్ని, అత్యాశ, భయం, ఒంటరితనం, అదంతా పరిశీలనగా గమనించాను. దాని గమనం అనుసరిస్తూ, దాన్ని పరిశీలిస్తూ, విశ్లేషణచేయకుండా కేవలం చూస్తూ వున్నాను. చూడగా చూడగా యిదంతా ఆలోచనవల్ల జరిగిందని తేలిపోయింది. ఆలోచన ఛిన్నాభిన్నంచేసేది కాబట్టి ఈ బంధాన్నికలిగించింది. ఎప్పుడైతే ఆలోచన ఈ సంగతి గ్రహించిందో అపుడు బంధంతొలిగిపోయింది ఇందులో ప్రయత్నం ఏమీలేదు. ఎందుకంటే, ప్రయత్నం వుందంటే, ఆ క్షణాన సంఘర్షణ తిరిగి ప్రవేశిస్తుంది.

ప్రేమలో బంధంలేదు. బంధముంటే ప్రేమ వుండదు. కాని దాన్ని కాదనడం ద్వారా,బంధాన్నికాదనడం ద్వారా అత్యధిక భాగం తొలిగించడమైంది. నిత్యజీవితంలో దీనిఅర్థమేమిటో నాకు తెలుస్తోంది, నా భార్యగాని, నా స్నేహితురాలుగాని, నాపొరుగువారుగాని నన్ను నొప్పించడానికి చేసిందేదీ నాకిపుడు గుర్తులేదు; ఆమెనుగూర్చి ఆలోచన సృజించిన ఏ మనోబింబంతోనూ బంధంలేదు; అంటే ఆమెనన్నెలా బెదిరించిందో - పొడిచిందో, నాకెలా హాయినిచ్చిందో, నేనెలా లైంగికానందంపొందానో, ఇంకా అనేక వివిధ విషయాలు గూర్చి ఆలోచనా చలనం చిత్రీకరించిన మనోబింబాలతో బంధంలేదు. వాటన్నిటితో బంధం తెగిపోయింది.

ఇంకా కొన్ని అంశాలున్నాయి, ఒక్కొక్కదాని గూర్చి నేను అంచెలంచెలుగా వెళ్లాల్సిందేనా? లేక అన్నీ అయిపోయినట్లేనా? బంధం గూర్చిపరిశోధించినట్లుగా భయం, ఆనందం, సుఖేచ్ఛ గూర్చి సాగాల్సిందేనా, పరిశోధించాల్సిందేనా? ఈ వివిధ అంశాల పరిశోధనలోకి పోనవసరంలేదనిపిస్తుంది; ఒక్క చూపుతో అంతా చూశాను, అంతా అవగతమైంది.

కాబట్టి ప్రేమకాని దాన్ని కాదనడం ద్వారా ప్రేమ కలిగింది. ప్రేమంటే ఏమిటని నేనడగనవసరం లేదు. దాని వెంట పడనక్కరలేదు దాని వెంట పడితే అది ప్రేమకాదు,ఒక ప్రతిఫలం. కాబట్టి ఆ విచారణలో (ప్రేమ) కాని ప్రతి దాన్నీ మెల్లగా,జాగ్రత్తగా, మెలిదిప్పకుండా, భ్రమలేకుండా కాదన్నాను. అంతంచేశాను-అపుడావేరైంది (ప్రేమ) వుంది.

[1977 ఆగస్టు 30న బ్రాక్‌వుడ్‌పార్క్ (ఇంగ్లాండు) సమావేశంలో జరిగిన చర్చాంశం]

# ప్రపంచంలో శాంతి

(ఐక్యరాజ్య సమితిలో కృష్ణజీ అభిభాషణం)

ప్రపంచంలో శాంతి నెలకొల్పేందుకు ఈ సంస్థతో సహా అనేక సంస్థలున్నాయి. కాని శాంతి లేదు. అందుకు అనేక స్పష్టమైన కారణాలున్నాయి జాతీయత,ఆటవికత, విరుద్ధ మతాలు, వర్గ విభజనలు, తెగలు, మున్నగునవి ..... అలాగే ఇస్రాయేలీయులూ అరబ్బులనీ, హిందువులూ ముస్లిములనీ, అమెరికనులూ రష్యనులనీ, అభిప్రాయాలకు వ్యతిరేకంగా అభిప్రాయాలూ చూస్తున్నాము... ఇన్ని వేల సంవత్సరాల తర్వాత కూడా మానవులు శాంతిగాజీవించడం లేదు, ఎందుకని ?

ప్రపంచంలో సాగుతున్న భీభత్సానికి మనమే బాధ్యులమని గ్రహిస్తున్నామా? అన్ని రకాల హింసకూ, తీవ్ర వాదానికీ, యుద్ధాలకూ మనమే బాధ్యులం. యుద్ధమున్నది బీరూట్‌లో కాదు, మన హృదయాల్లో, మన మనస్సుల్లో మనం జీవిస్తున్న ఈ సమాజాన్ని మనమే సృష్టించాము. మనమే ఈసమాజం మనలో ప్రతి ఒక్కరూ తనకు తాను విప్లవాత్మకంగా మార్పు చెందనంత వరకూ మనకు ఎడతెగని యుద్ధాలుంటాయి

మనిషి నిబద్ధితు డయ్యాడు.....ఒక ప్రత్యేక సంప్రదాయాన్నీ, మతాన్నీ ... బట్టిమనుషుల మెదళ్ళు మలచ బడ్డాయి. మానవులకు తమ నిబద్ధత నుండిస్వేచ్ఛ పొందడం సాధ్యమా ? ఒక అమెరికనుగా, ఒక యూరోపియనుగా, ఒకహిందువుగా నిబద్ధమైన దాన్నుంచి స్వేచ్ఛ పొందడం సాధ్యమా?.....అసలుమానవులెందుకు అలా నిబద్ధ మైనారు? బహిర్గతంగానూ, అంతర్గతంగా నూమనం భద్రత కోరుతున్నందు వల్లనా? ఏ రకమైన భద్రతగానీ అంతర్గతంగా వుందా? అది రూఢిగాక పోతే మనం బయట బయట, బహిర్గతంగా దేశాల ద్వారా,మత సంస్థల ద్వారా భద్రత అపేక్షిస్తాం.....మనమిప్పుడు దాన్ని గురించి కలిసిమాట్లాడాలి, మన పరస్పర సంబంధాలలో భద్రత వుందీ, లేందీ మనకు మనంకనుగొనాలి - అని ఎంత సన్నిహిత (సంబంధ) మైందైనా సరే. భద్రతవున్నట్లయితే, స్త్రీ పురుషుల మధ్య అలాంటి అభిప్రాయ మెందుకు వుంది,వాళ్ళ సంబంధంలో అలాంటి ఘర్షణ ఎందుకు వుంది? ప్రతి మనిషీ తన కాంక్షలవెంటపడటం, తన ఆశయ సిద్ధికి పాటు పడడం, తన కోరికలు మున్నగు వాటికి కృషి చేయడం ఎందుకు జరుగుతోంది? దూరం

వెళ్ళాలంటే దగ్గర ప్రారంభించాలి. అతి దగ్గిర వుంది స్త్రీపురుషులూ, భార్యా భర్తలూ. ఆ సంబంధంలో, ఇప్పుడున్నట్లుగా ఘర్షణ వుంటే, అది వ్యాపిస్తోంది - చివరికి యుద్ధం. మనమెన్నడూ ఇది ఆలోచించ లేదు, మన ఇల్లు తగలబడి పోతోందీ కాబట్టి -అదే మన సమాజం దగ్ధమైపోతోందీ, కృశించి పోతోందీ కాబట్టి - మనం కూడా కృశించి పోవడం లేదా? మన జీవితాలను మార్చక పోతే మనం భూమ్మీద శాంతిని ఎలా నెలకొల్ప గలం? ఇదెంతో తార్కికంగా, హేతు బద్ధంగా, తెలివిగా కనపడతుంది. కాని మనం అది చెయ్యం. మానసిక ప్రపంచం నెమ్మదిగా, తెలివిగా, శాంతిగా వుండక పోతే అలాంటి మానసికస్థితి ఎల్లప్పుడూ ఎలాంటి సంస్థనైనా అధిగ మిస్తుంది. బయట వుండేశాసనం, ప్రభుత్వాలు మున్నగు వాటికన్నా చిత్తవృత్తి మిక్కిలి ఎక్కువ ముఖ్యమైంది.

మనం మొదటి నుంచీ మతం వలన, సమాజం వలన, సంస్కృతి వలన నిబద్ధమైపోయాము. పర్యవసానం ప్రతి మనిషీ విడివిడిగా, ఒక వ్యక్తిగా తయారయ్యాడు. అంచేత అతడు తన సొంత ముక్తినీ, సొంత వ్యక్తీకరణనూ, సొంత సాఫల్యాన్నీ వెదుక్కో వలసి వస్తోంది ఈ ప్రత్యేక వ్యక్తిత్వ మనబడేది ప్రపంచంలో సంక్షోభాన్ని పుట్టిస్తోంది. దాని అర్థం మనం అందరం ఒకే రకం కావాలని గానీ, ఒకే మూస నుండి రావాలనిగానీ కాదు. దానికి భిన్నంగా, స్వాతంత్ర్యం అనేది మనఉనికికి అత్యున్నతమైన రూపం. స్వేచ్ఛగా జీవించడం అత్యుత్తమ కళ. కాని మనం స్వేచ్ఛగా లేము. మనిషి తనకు నచ్చింది చేయడం స్వేచ్ఛ అనుకుంటున్నాడు. ప్రత్యేకించి ఈ దేశంలో, ప్రతి వ్యక్తీ తాను కోరుకొనేది చేయడానికి తాను సర్వోన్నతుడని భావిస్తాడు. కాని..... ప్రపంచాన్ని చుట్టి, సన్నిహితంగా పరిశీలిస్తే ప్రతి మానవుడూ - తనకు గొప్ప స్థానం వున్నా లేకపోయినా, మంచి ధనాధిక్య వున్నా లేక పోయినా, పెద్ద హోదా వున్నా లేకపోయినా, ఎంతో అధికారం వున్నా లేక పోయినా - మానసికంగా మిగతా ప్రపంచంలాగానే వున్నాడు.

అతడు మహా మహాక్లేశమూ, నిరాశాభరితమైన ఒంటరి తనమూ అనుభవిస్తున్నాడు అస్థిమితంగానూ, అయోమయంగానూ వున్న మిగతా మానసిక ప్రపంచం ద్వారా నలిగి పోతున్నాడు; మనవే ఆ మిగతా మానవాళి. మనం ఆఫ్రికనులం కాము, యూరోపియనులం కాము, ఆ అర్థంపర్థం లేంది కానేకాము. మనం మానవులం. మన జీవితంలో ఆ ఒక్క ప్రధానాంశం లోతుగా గ్రహించక పోతే, మనమంతా మానసికంగా

ఒకటని తెలిసికోక పోతే మనం శాశ్వతంగా ఘర్షణలో వుండి పోతాం. అది వాస్తవం, దాన్ని ప్రపంచంలో ఏ సంస్థా మార్చలేదు.

కాబట్టి మీరు తీవ్రంగా వుంటే, ప్రపంచాన్నీ, మీ సొంత జీవితాన్నీ పట్టించుకొంటే ఒక మానవ జీవి ఏంచేయాల్సి వుంది? మరో మురానీ, మరో మతాన్నీ, మరో వ్యవస్థనూ తయారు చేయడమా? లేక ఒక మానవుడుగా తనస్థితి పట్ల ఎరుక వహించాలి, తన నిబద్ధతను పట్టించుకోవాలి, ఆ నిబద్ధతనుంచి మనసుకు స్వేచ్ఛ నివ్వాలి......తీవ్రమైన మార్పు చెందాలి, లోతైనపరివర్తన తీసుకు రావాలి. లేకపోతే మతాలన్నీ వున్నా, ఏ సంస్థ వున్నా భూమ్మీద శాంతి వుండదు. మార్పు మనతో మొదలవ్వాలి, బయట ఎక్కడో వుండేఎవరితోనో కాదు.

మనం బయట, సాంకేతికంగా మహాద్భుత కార్యాలు చేశాము, కాని లోలోపల అల్పమైన పేద నమూనాలము. మిక్కిలి సన్నిహిత సంబంధాల్లో కూడా మనంపరస్పరం పోరాడు కొంటున్నాము. తన లోపల శాంతి లేకుండా బయటిప్రపంచంలో శాంతి ఎలా వుంటుంది? ఆ ప్రశ్నకు మన మెన్నడూ బదులుచెప్పం.. ..బయట బయట మార్పులు తేవాలని మన మెప్పుడూ ప్రయత్నిస్తుంటాం. మనలో ప్రతి ఒక్కరూ మౌలికంగా, తీవ్రంగా మార్పుచెందందే, పృథ్వీపై శాంతి వుండదనే సంగతి మనం ఎప్పుడూ గ్రహించిట్లు లేదు. మనం ఇలా ఎందుకు బ్రతుకుతున్నాము, మన మొత్తం చిత్తవృత్తిని తీవ్రంగా మార్పు జేయ సాధ్యమా అనేది మన మీద, మనలో ప్రతి ఒక్కరి మీదా వుంది. ఆక్కడ విప్లవం రానిదే, కేవలం బయటి విప్లవాలకు సార్థకత లేదు. ప్రపంచమంతటా కమ్యూనిస్టు విప్లవం, ఫ్రెంచి విప్లవం, ఇతర విప్లవరూపాలు వచ్చాయి. అయినా మనం ఉన్న తీరులోనే వుండి పోయాం -స్వార్థమే కేంద్రస్థంగా, క్రూరంగా, ఇంకా అలాంటి ధోరణిలోనే వున్నాము.

(1984 ఏప్రిల్ 17న డాగ్ హెమరల్ లైబ్రరీ ఆడిటోరియం, న్యూయార్క్‌లో పెర్రిన్‌సొసైటీ పాసెం స్పీకర్‌గా చేసిన సంభాషణలో ముఖ్యాంశాలు - U.N. Secretariat"NEWS", May 16, 1984 )

# ప్రవచనసారం
## (THE CORE OF TEACHING)

(1980 అక్టోబరు 21 న కృష్ణమూర్తిగారు స్వయంగా మేరీ లట్యెన్స్‌కు వ్రాసియిచ్చినది.)

కృష్ణమూర్తి 1929 లో చేసిన ప్రకటనలో వారి ప్రబోధసారం ఉంది. అదేమంటే -"సత్యం పంథాలేని ప్రదేశం".

మానవుడు ఏ సంస్థ ద్వారాగానీ, ఏ మత విశ్వాసం ద్వారాగానీ, ఏశాఖా సంప్రదాయం ద్వారాగానీ, ఏ సైద్ధాంతిక పిడివాదం ద్వారాగానీ, ఏ పూజారి లేక కర్మకాండ ద్వారాగానీ, ఏ వేదాంత విషయిక జ్ఞానం ద్వారాగానీ, ఏ మానసికనైపుణ్యం ద్వారాగానీ సత్యాన్ని చేరలేడు. సంబంధమనే అద్దం ద్వారా, స్వీయ మానసిక విషయావగాహనద్వారా, పరిశీలనద్వారా సత్యాన్ని కనుగొనాలి.అది బుద్ధి విశ్లేషణవల్లనూ, పరిచ్ఛేద దృష్టివల్లనూ జరగదు.

మానవుడు తనలో మనోరూపాలు నిర్మించుకున్నాడు, అవి భద్రత అనే కంచెగా పనిచేస్తాయని భావిస్తున్నాడు. అవి మతపరంగా, రాజకీయంగా, వైయుక్తికంగా ఉన్నాయి. అవి సంకేతాలుగా, అభిప్రాయాలుగా, నమ్మకాలుగా పరిణమిస్తున్నాయి. ఈ మానసిక రూపాల బరువు మనిషి ఆలోచనపైనా, సంబంధాలపైనా, నిత్యజీవితంపైనా ఆధిపత్యం చలాయిస్తున్నాయి. ఈ రూపాలేమన సమస్యలకు కారణం. ఎందుకంటే అవి మనిషినుండి మనిషిని విడదీస్తున్నాయి. ముందుగా మనస్సులో స్థిరపడ్డ అభిప్రాయాలవల్ల మనిషికి జీవితం పట్ల దృష్టి మలచబడుతుంది. అతని చేతనంలోని వస్తువే అతని మొత్తం ఉనికి, బ్రతుకు. చేతనత్వం మానవాళి యావత్తుకూ సర్వసామాన్యమైంది.

వ్యక్తిత్వం అనేది ఒక నామం, ఒక రూపం, పైపై సంస్కృతి. వ్యక్తిత్వం సంప్రదాయం నుండి లభిస్తుంది, సాధించిన దాన్నిబట్టి ఉంటుంది. మనిషిప్రత్యేకత పైపై సంస్కృతిలో లేదు, సామాన్య చేతన వస్తువునుండి పూర్తిగా విముక్తి కావడంలో ఉంది. చేతనత్వం మొత్తం మానవాళికి ఒక్కటే కాబట్టి మనిషిని ఒక ప్రత్యేక వ్యక్తి అని అనడానికి వీల్లేదు.

స్వేచ్ఛ అనేది ప్రతిక్రియ కాదు, ఎంచుకోవడం కాదు. ఎంచుకొనే అవకాశం ఉందికాబట్టి మానవుడు స్వేచ్ఛాజీవి అని అంటారు. అదంతా నటన. మార్గనిర్దేశకత్వం లేనటువంటీ దండనమండనలపట్ల భీతిలేనటువంటీ పరిశీలనయే స్వేచ్ఛ. అది ఉద్దేశపూర్వకమైంది కాదు. మానవుడు పరిణతి చెందిన పిదప లబ్దమయ్యేది కాదు. స్వేచ్ఛ జీవితపు తొలిమెట్టులో ఉండేది. కాని అది జీవితంలో లేకపోయిందనే విషయం మానవుడు తన పరిశీలనద్వారా తెలునుకోవడం మొదలుపెడతాడు. మన దైనందిన స్థితి పట్ల ఎన్నుకోని ఎరుక వహిస్తే, మన నిత్యకార్యకలాపాలను ఒకేఒక ఎరుకతో గమనిస్తే ఆ ఎరుకలో స్వేచ్ఛ కనుగొంటాము.

ఆలోచనే కాలం. అది అనుభవం నుండీ, జ్ఞానం నుండీ పుట్టింది. అనుభవమూ, జ్ఞానమూ కాలం నుండీ గతం నుండీ విడదీయరానివి. కాలం మానవుని మానసిక శత్రువు. మానవుని చర్య జ్ఞానం మీద ఆధార పడింది; కనక కాలం మీదనూ ఆధారపడి ఉంది. కాబట్టి మనిషి ఎప్పుడూ గతానికి బానిస.

ఆలోచన ఎప్పుడూ పరిమితం. అందుకే మనం ఎప్పుడూ ఘర్షణలోనూ,పోరాటంలోనూ, జీవిస్తుంటాము. మానసిక (ఆలోచనలో) పరిణామం అంటూ లేదు. ఆలోచనా గమనం ఎరుకలో ఉన్నపుడు, ఆలోచనా పరునికీ, ఆలోచనకూ మధ్య విభజన ఉన్నట్లు తెలుస్తుంది. అలాగే పరిశీలకునికీ - పరిశీలితానికీ,అనుభవజ్ఞునికీ - అనుభవానికీ మధ్య విభజన తెలుస్తుంది. ఈ విభజన ఒకభ్రమ అని కనుగొంటాడు. అపుడు మాత్రమే కేవల పరిశీలన ఉంటుంది. అదే అంతర్దృష్టి. దానిలో గతం యొక్క నీడ ఉండదు, అంటే కాలం యొక్క నీడఉండదు. కాల ప్రమేయం లేని ఈ అంతర్దృష్టి మనసులో లోతైన తీవ్రపరివర్తన తెస్తుంది.

మొత్తాన్నీ కాదనడమే ధనాత్మక మైన దాని సారం. ప్రేమకానటు వంటి - కోరిక,సౌఖ్యం, ఆనందం మున్నగు వాటిని - అన్నిటినీ కాదన్నపుడు ప్రేమ ఉంటుంది. ఆ ప్రేమ కరుణతో, ప్రజ్ఞతో కూడి ఉంటుంది.

(ఇది మేరీలట్సెన్స్ కోరగా వ్రాసినది)

# నవీన నిర్వచనాలు

I am nobody, just a passer-by

నే నెవరినీ కాదు, ఒక బాటసారిని మాత్రం

The seer who walks Alone

ఏకాంతంగా నడిచే ద్రష్ట

Man is not the measure of himself

మనిషి తనకు తాను కొలమానం కాదు

The ancestry of insight

లోజూపు యొక్క వంశానుగతం

If it (some thing sacred) is there, why is

this part of the world so currupt ?

పవిత్రత అనేది ఉంటే ఈ ప్రపంచ భాగం ఇంత అవినీతిగా ఎందుకుంది ?

Self-interest is the door which shuts the other out

స్వార్థ ప్రయోజనం ఇతరాన్ని మూసేటు వంటి తలుపు

To live by the teaching

ప్రవచనం బట్టి జీవించడం

All time is now - that means death and living are together, they are never separate ...there is no divorce or separation between living and dying

కాలం మొత్తమూ ఇప్పుడే - అంటే చావు బ్రతుకులు కలిసే వున్నాయి, అవి ఎన్నడూ వేరుగా లేవు.....జీవించడానికీ మరణించడానికీ మధ్య విడాకులు గానీ వేర్పాటు గానీ లేవు

No man from outside can make you free

బయట నుండి ఎవ్వరూ నీకు స్వేచ్ఛ ఇవ్వలేరు

The good was not related to the bad

మంచి, చెడు నుండి రాలేదు, చెడుతో సంబంధపడి వుండింది కాదు

We are humanity

మనమే మానవ జాతి

Life will not miss you, if you think it does, something is wrong with you

జీవితం నీనుండి తప్పిపోదు, పోతుందని నీవనుకుంటే, నీలో ఏదో దోషం వుంది.

My teaching is neither mystic nor occult, for I hold that both mystism and occultism are man's limitations upon truth

నా బోధన మార్మికమూ కాదు, అతీంద్రియతా కాదు; ఎందుకంటే మార్మికతా అతీంద్రియతా రెండూ సత్యంపై మానవుని పరిమితులుగా చూస్తాను

You know this idea that people do not understand, therefore you must give them something they will understand, is really a clever way of exploitation

ప్రజలకు అర్థం కాదు గనుక వాళ్ళకు అర్థమయిందేదో ఇవ్వాలనే అభిప్రాయం నిజంగా యుక్తితో దోచుకొనే విధానం; ఇది తెలుసా ?

Craving is the cause of frustration and hepelessness

తాపత్రయం నిరుత్సాహానికీ, నిరాశకూ కారణం

Craving for sensuality indicates inward poverty

ఇంద్రియలోలతకు తాపత్రయ పడడం లోని బీదరికాన్ని సూచిస్తుంది

Do not merely put on a mask of my ideas

కేవలం నా అభిప్రాయాల తొడుగా వేసుకోవద్దు....

You fear I may be right and hope I may be wrong

నేను రైటు (సరి)గా వుండొచ్చేమోనన్న భయమూ, నేను తప్పుగా వుండొచ్చేమోనన్న కాంక్ష మీకు వున్నాయి.

JARGON - threacherous foe to understanding

తాత్సారం -

do not base action on any idea

ఎలాంటి అభిప్రాయం మీద్గా క్రియ ఆధారపడి జరగదు

To concentrate is to contraction

ఏకాగ్రత జూపడం సంకోచానికే

By living fully in the present we are free from the past and conquer the future

ప్రస్తుతంలో పూర్తిగా జీవించడం వల్ల గతం నుండి స్వేచ్ఛ పొందుతాము,భవిష్యత్తును జయిస్తాము.

Truth is a pathless land.. ..If you follow some one you cease to follow truth

సత్యం ఒక దారిలేని దేశం.....ఎవరినైనా అనుసరించడం ఆరంభిస్తే సత్యానుసరణంనుండి ఆగిపోతావు

The plight of the Eagle -

విహంగ మార్గం

The Flame of Attention

సావధాన జ్వాల

The urgency of change

మార్పునకు శీఘ్రగతి

I show you sorrow and the ending of sorrow

దుఃఖాన్ని చూపిస్తాను, దుఃఖాన్ని అంతం చేయడం చూపిస్తాను

Enlightenment is not an end that is fixed. It is a timeless movement in love

జ్ఞానోదయం ఒక అంతం కాదు, అది ప్రేమలో ఒక గమనం, కాల రహిత మైనది

The wholeness of life

జీవిత పూర్ణత్వం

The impossible question

అసాధ్యమైన ప్రశ్న

God is disorder

దైవమంటే అక్రమత

Freedom is not choice ....Freedom is found in the choiceless awareness of our daily existance

స్వేచ్ఛ ఎంపికకాదు.....స్వేచ్ఛ నిత్య జీవితపుటునికి యొక్క ఎన్నిక లేని ఎరుకద్వారా తెలుసుకుంటాము

Cruelty has many forms and its ultimate expression is the examination

క్రూరత్వానికి కోటిరూపాలు; దాని అంతిమ వ్యక్తీకరణ పరీక్ష

Time does not pass, only you and I do

కాలం గడవదు; మీరూ నేనూ మాత్రమే సాగిపోయేది

The craving for experience is the beginning of illusion

అనుభవానికి తాపత్రయ పడడం భ్రాంతికి ప్రారంభం

Speculation and imagination are the enemies of attention

కల్పన, ఊహ సావధానతకు శత్రువులు

To die rich is to have lived in vain

ధనవంతంగా చావడమంటే వృధాగా జీవించడమైనట్లు

# కృష్ణ సూక్తము

1 చీకటియందైననూ తడుముకుంటూ కాంతి వైపుకు కదలవలెనేగాని నీవద్దకుఎవరూ వెలుగును తీసు కొనిరారు.

2. జీవిత మంటే సంబంధం. మనుషులతోనూ, పరిసరాలతోనూ, మనోభావాలతోనూ సంబంధం సరైందిగా ఉండాలి.

3. వ్యక్తి వేరు, మానవుడువేరు, వ్యక్తి ప్రాంతీయుడు, మానవుడు విశ్వజనుడు.

4 పరివర్తనము వ్యక్తి హృదయమున ప్రారంభము కావలెను.

5 గాయపడకుండుట గొప్ప కౌశలము. అది అన్ని గాయాలను హరించును

6 సంస్కరణ వలన దుఃఖము తొలగదు, స్వభావములో మార్పురావలెను.

7 వ్యక్తి వికాసానికి కుల-మత-జాతి-దేశ-వర్ణ-వర్గ తత్త్వములు అవరోధాలు.

8 ప్రపంచమంటే నీవే ! ప్రపంచ సమస్యలకు కారణము నీవే ! వాటిని పరిష్కరించుకొనుట నీబాధ్యత.

9 చైతన్యము అఖండము. అందు దశాభేదాలు లేవు.

10. చైతన్యము మనిషిలో ఉంది. సంఘములో లేదు. మతములోలేదు.

11. చైతన్యవంతంగా ఉండు, అంటే పూర్తిగా చొరవ, ప్రేమ, దయ, సానుభూతి,మన్నింపు కలిగియుండుట.

12. లోన జీవనరాగమెరుగనివాడు బయట వినోదానికై వెదకును.

13. శారీరక శ్రద్ధ చాలా అవసరం, నిర్లిప్తత కూడ అంతే అవసరం.

14. నాకే తెలియునను వానికేమీ తెలియదు.

15 అధికారము అవగాహనను అణచును.

16.జ్ఞానంవేరు. నేర్చుకోవడం వేరు. జ్ఞానమంటే విషయ సేకరణ నేర్చుకోవడమంటే తక్షణ గ్రహింపు.

17 మూఢనమ్మకాలు మనుజులను వేరుచేయును, భ్రమ కలిగించును.

18 "నేను" (అహం)విడుచుట ప్రేమ; నిజమైన ప్రేమ వ్యక్తుల మధ్య వ్యత్యాసం చూపదు. నేనంటే ఆత్మకాదు. నీ సంబంధ బాంధవ్యాలూ, అభిప్రాయాలూ,పోకడలూ, ఉనికీ-అన్నీ కలిసి నేను అవుతుంది.

19 ప్రేమ గతానికి సంబంధించింది కాదు. ఎప్పటికప్పుడు అనుభూతి చెందవలసింది.

20 వ్యక్తిగత ప్రేమ నాకులేదు. ప్రపంచాన్ని ప్రేమించుట మానను.

21 ప్రేమ నిండుగా ఉంటే మాటలెందుకు ?

22 సౌందర్యాన్ని ఆస్వాదించు, ఆశించకు.

23 వస్తువులు అవసరార్థమేగాని ప్రదర్శనార్థంకాదు.

24 దౌర్జన్య ప్రతీకారాలకు పుట్టిల్లు భయం.

25 భయం చిత్తాన్ని కుదింప జేస్తుంది, స్వేచ్ఛను హరిస్తుంది.

26 మంచితనంలో స్వయం సంరక్షణ లక్షణమున్నది.

27 ఆలోచన చాల మోసకారి; ఆలోచన పదార్థమే, అది జ్ఞాపకాలకు పరిమితం,కాలానికి కట్టుబడినది. ఆ బందిఖానా నుండి బయటపడు.

28 ఆలోచన, ఆలోచనాపరునికి వేరైంది కాదు. ఆలోచనాచలనము దుఃఖ తీవ్రత కల్గిస్తుంది.

29 ఆలోచన అంతమైతేగాని అవగాహన కుదరదు.

30. తక్షణక్రియా శీలతయే అవగాహన.

31. ప్రతిదానిని ప్రశ్నించు, పరిశీలించు, పరీక్షించి గ్రహించు.

32 సంప్రదాయ బద్ధునికి మర్యాద లభించవచ్చు. కాని అవగహన యేర్పడదు. అలాంటి వానికి ప్రేమించుట తెలియదు.

33 ప్రచారమొక అబద్ధం. అది అవగాహనకు అడ్డుగోడ.

34 పుస్తకాలు, పాండిత్యం, గురువులు, మతాలు. నీ సమస్యలు తీర్చలేవు.

35. సహాయం కోరు స్థితిలోనున్న వారు ఇతరులకు సహాయం చేయలేరు.

36. రాజకీయవేత్త ప్రపంచానికి శాంతి చేకూర్చలేడు.

37. సమస్యను పూర్తిగా అవగహాన చేసికొనుటలోనే పరిష్కారముంది.

38. ప్రేమ లోపించడమే సమస్యలకు మూలం.

39. స్వచ్ఛందము సహజమునైన పరిశీలన సుఖాన్నిస్తుంది. పరిశీలించడానికి పూర్వానుభూతీ, అంగీకారమూ, నిరాకరణా పనికిరావు.

40. ప్రతిముద్ర మనసుపై పడనీయకు. పిల్లలవలె నీవు అవసరంలేని దానిని నీమనసు నుండి తొలగిపోనిమ్ము.

41 నిత్యవ్యవహార విషయాలూ, విజ్ఞానశాస్త్ర విషయాలూ తప్ప మానసికానుభూతులు మరచిపోవాలి.

42. మానసిక స్పష్టతే వెలుగు! అస్పష్టత, ఘర్షణ, గందరగోళం సమస్యలకు మూలం.

43. ప్రస్తుత సమస్యకు గత మథనం వృధా. గందరగోళాన్ని గ్రహిస్తే క్రమత ఏర్పడుతుంది.

44. సంప్రదాయాన్ని గూర్చి ఆలోచించే మనసు కొత్తదానిని తెలిసికోలేదు.

45. కొత్తది పాతదానిలో లీనమగుచున్నంతవరకు కొత్త వెలుగురాదు. పాతది పోనిదే కొత్తది నిలవదు.

46. గతాన్ని నెమరువేసుకొనుట గందరగోళానికి కారణం.

47. గత స్మృతి మనసనే అద్దానికి మసక లాంటిది.

48. గత స్మృతులు మనసుకు భారం. కనుక వాటిని విడిచిపెట్టు.

49. గతాన్ని మరచినవారికి మరణభయం లేదు.

50. మరుపే మరణం. నిత్యమరణమే నూత్నజీవనం.

51. నిజజీవితం నుండి తప్పుకోడానికి దైవమైనా ఒకటే, తాగుడైనా ఒకటే.

52. మృత్యువు స్వల్ప విషయం. హృదయమున ద్వేషంతో జీవించుటకన్న మరణించుట మేలు.

53 తెలివియన పరిశీలించు స్వేచ్ఛ. స్వేచ్ఛ ఒక మానసిక స్థితి.

54. విశ్వాసానికీ, సూత్రానికీ, సిద్ధాంతాలకూ మనను పరిమితమై ఉండడమే నిబద్ధత; అదే బంధం, దాని నిర్మూలనమే స్వేచ్ఛ.

55 నిబద్ధత జిజ్ఞాసకు ఆటంకం.

56. కట్టుబడిన జీవితానికి ఆందోళన తప్పదు.

57. విజయానికి పోటీపడడం మొరటుతనం. విజయం మతం, రాజకీయం, కళ మున్నగు రూపాలతో ఉంది.

58. కాంక్షలతో గూడినవాడు శాంతిగ నుండలేడు. ప్రార్థనలో శాంతి లేదు. సక్రమసంబంధములోనే కలదు.

59 ఆశ అంటే స్వార్థపూరితమైన వాంఛ.

60. వాంఛ అంటే ఫలాపేక్ష. అది హృదయాన్ని కుంచింప జేస్తుంది

61 కాంక్షకు మూలము జ్ఞాపకం.

62. ఆత్మ, అహం అను వాటికాధారము కాంక్ష.

63 దుఃఖానికి దగ్గరదారి లభేచ్ఛ.

64 విశ్వాసం ప్రమాదభరిత మైంది.

65 విశ్వాసం వేరు-వాస్తవం వేరు. విశ్వాసం బంధిస్తుంది. వాస్తవం స్వేచ్ఛనిస్తుంది.

66 వ్యవస్థీకృత విశ్వాసం మతము. అది ధనానికీ, అధికారానికీ ప్రాకులాడుతుంది.

67. కుల-మత జాతి-వర్గ విభేదాలతో ఒకరినుండి ఒకరిని విడదీయుట హానికరం.

68 దైవం మనో జనితం

69. దైవంగానీ, సత్యంగానీ, యదార్థంగానీ, ఏ పేరైనా అసలు, ఉన్నదా లేదా అనుప్రశ్నకు సమాధానం పుస్తకాలుగాని, మత ప్రచారకులుగాని,

తత్త్వవేత్తలుగాని,జగద్రక్షకులుగాని చెప్పలేరు. నీవుతప్ప ఎవరు బదులు చెప్పలేరు.

70 ధ్యానమనగా మనసును ఖాళీ చేయడం, నూతనత్వమివ్వడం.

71 అంతర్గతంగానూ, బహిర్గతంగానూ సమస్త ఘర్షణలు తొలగడం ధ్యానం.

72 ధ్యానానికి జాగరూగతగల మనసు కావాలి.

73 ప్రతిమ, చిహ్నం, భావన, లక్ష్యం కలిగిన నిశ్శబ్దత ధ్యానం కాదు.

74 ధ్యానమనగా ప్రార్ధనకాదు, ప్రార్ధన దైన్యంతో కూడిన వేడికోలు. ధ్యానం శబ్దాంతం.

75 ధ్యానంలో ఊహకూ, ఆలోచనకూ తావులేదు. అవి రెండూ బంధాలు ధ్యానం స్వేచ్ఛ నిస్తుంది.

76 పూర్వ నిశ్చయం అనుచితము. నిత్యజాగృతి ఉచితము.

77. ఎన్నికలేని ఎరుక (choiceless awareness) అవసరం.

78 మౌనం వేరు-నిశ్శబ్దత వేరు. మొదటిదానిలో శ్రద్ధ-రెండోదానిలో ప్రయత్నం ఉంటాయి

79. ఏకాగ్రతవేరు-శ్రద్ధవేరు. ఒక వస్తువుపై కేంద్రీకరించడం ఏకాగ్రత, దానికి బలవంతపు హద్దులున్నాయి. ఒక వస్తువుపై ఆసక్తి చూపడం శ్రద్ధ, దానికి హద్దులు లేవు.

80. ఒంటరితనం ఏకాంతం కాజాలదు. ఒంటరితనంలో లేవడియున్నది. ఏకాంతంలో కలివిడి యున్నది.

81. ఆనందంవేరు - వినోదంవేరు. ఆనందం ఆహ్వానితం కాదు-వినోదంఅభ్యానయుతం.

82. ఎవరికివారే సత్యశోధకులు కావాలి.

83 సత్యానికి నిర్దిష్టమార్గాలు లేవు.

84. అన్నిదారులు ఒకే ద్వారం (సత్యం) వద్దకు చేరతాయనడం బూటకం.

85 ఇతరుల జీవితానుభవాలు సత్యాన్ని చూపవు.

86 మంత్ర-తంత్ర-పూజా-ధ్యానాలు సత్యాన్ని చూపించలేవు.

87 ఉన్నది ఉన్నట్లుగా, లేనిది లేనట్లుగా గ్రహించడం సత్యం. సత్యంలోని అసత్యాన్నీ, అసత్యంలోని సత్యాన్నీ గ్రహించడం సత్యదర్శనం.

88 హృదయవికాసం వలన సత్యం బహిర్గత మౌతుంది.

89 సత్యశోధనకు కావలసింది అవగాహన, సాధనకాదు. సాధన దేశ కాలమానపరిస్థితులకు బద్ధమైనది

90 మతం విశ్వాసంమీద ఆధారపడింది. అందుచే మతవిశ్వాసం ద్వారా సత్యదర్శనం కలుగదు.

91 సత్యదర్శనానికి గురూపదేశమూ, ఇజాలూ, సిద్ధాంతాలూ రాద్ధాంతాలూ పనికిరావు. అవి స్వేచ్ఛావగాహనకు బంధాలు.

92 శంకరుడో, బుద్ధుడో మరో మేధావియో చెప్పింది నమ్మి ఊహాగానం చేయడం సత్యశోధన కాదు.

93 సత్యమనేది అంధకార ఆలయ పూజాగృహాలలో కనిపించదు.

94 సత్యం యొక్క ఆనందానుభూతియే నిండుజీవితం.

95 సత్యం మీ హృదయంలో ఉంది. మీరే కనుగొంటారు.

96 వాక్యం సత్యము కాదు. అనుభూతే సత్యం

97 గొప్ప బోధకుడెవడూ మహత్తులు జూపడు. మహత్తుజూపుట సత్యానికి ద్రోహం చేయడమవుతుంది.

98 గతానుభవం సత్యంకాదు.

99 వ్యక్తికి వికాసమూ, సంఘానికి శ్రేయస్సూ చేకూర్చేదే విద్య.

100 సరైన విద్య విద్యార్థులు ఎలా ఆలోచించాలో నేర్పాలి. ఏమి ఆలోచించాలోకాదు.

I maintain that truth is a pathless land and you cannot approach it by any path whatsoever, by any religion, by any sect

I think it is important to learn the art of thinking together Thinking together doesnot mean to be of one mind Freedom is the essence of thinking together

A belief is purely an individual matter, and you cannot and must not organise it

I have no authority. Don't make me a guru. I have no following I don't want all that kind of stuff, because organisations and institutions are not going to save man

There is not going to be any peace in the world if the politicians have anything to do with it.

Understanding is bridge.

We are not Africans and Europeans and all that nonsense We are humanity